మూడో కన్నీటి చుక్క

బొల్లోజు బాబా

డిశంబరు 2019

వెల - `100/-

కాపీల కొరకు
బొల్లోజు బాబా
30-7-31
సూర్యనారాయణ పురం
కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా
ఫోన్: 0884/2368189
9849320443
bollojubaba@gmail.com

కవర్ డిజైన్: అక్బర్

గెటప్: చిన్నారి

ముద్రణ: రాంషా ప్రెస్, సామర్లకోట

## A Few Tearful Pages from a Social Scientist

వొక సంపుటి వెలువడిన తరవాత కవి ముందు మహాద్వారమేదో తెరుచుకుంటుంది.

ఆ ద్వారాన్ని దాటుకొని అతను యెటు వైపు అడుగేస్తాడా అని లోకం కనీసం పది కళ్ళతో యెదురుచూస్తుంది. అందులో కొన్ని కళ్ళు పచ్చగా అసూయతో– కొన్ని కనిపించీ, యింకొన్ని కనిపించని– చూస్తూ వుంటాయి. చాలా కష్టం! చాలా అయిష్టంగా కూడా వుంటుంది. అట్లా అని తెరుచుకున్న తలుపుని మూసేసి వెనక్కి వెళ్లలేడు కవి. ముందుకే వెళ్ళాలి. ముఖ్యంగా చాలా కవిత్వ పుస్తకాలు వెలువడుతున్న కాలంలో తనదే అయిన దారీ, చూపూ వుంటే తప్ప అట్లా ముందుకు వెళ్ళడం సాధ్యం కాదు. అవేమీ లేకుండానే కొంతమంది ముందుకు వెళ్తున్నామన్న భ్రమలో బతికేస్తూ వుంటారు. ఆ భ్రమని పాఠకులు బ్రేక్ చేసి, వాస్తవంలోకి ఈడ్చి కొడ్తారు, నిశ్శబ్దమైన నిరాకరణతో–

నన్ను నేను కూడదీసుకునే ప్రయత్నంలో ఇద్దరు కవుల్ని ఈ మధ్య మార్చి మార్చి చదువుతున్నాను. మార్చి మార్చి చదవడం అంటే కాసేపు ఈ కవి పేజీలు కొన్ని, ఇంకాసేపు ఆ కవి పేజీలు కొన్ని– ఇద్దరినీ వొకేసారి చదువుతున్నా. ఆ ఇద్దరు: వొకరు మన కవి బాబాజీ. మరొకరు: వాల్ట్ విట్మన్.

### 1

బాబా రెండో కవిత్వ పుస్తకం నాకు అంది, చాలా కాలమే అయింది. ఈ లోపు నా జీవితంలో వూహించని విషాదం ఎదురైంది. అమ్మ పోయింది. కవిత్వం చదివే మనసూ లేదు. ఇక నాలుగు మాటలు రాసే చేతులేవో పడిపోయినట్టుగా అనిపించింది. కానీ, బాబా కవిత్వం మధ్యలో చదువుతూనే వున్నాను. చదువుతూ చదువుతూ ఆగిపోతున్నాను. ఆగిపోయిన చోట యేదో వెతుక్కుంటూ వున్నా. అట్లా వెతుక్కుంటున్నప్పుడు మరీ ముఖ్యంగా వొక కవిత దగ్గిర కాస్త యెక్కువ సేపు నిలిచి వున్నాను.

ఆ కవిత శీర్షిక: ఒక కవిని కలిశాను
రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు
కానీ తన పేరులో సజీవంగా ఉంటాడు
ఇన్ని సంవత్సరాల జీవితాన్నీ
తన పేరులో దాచుకొన్నాడు
అక్షరాలుగా, వాక్యాలుగా, కవిత్వంగా....

మరణాలూ, జననాలూ, ఉత్సవాలూ, నిరుత్సాహాలూ మామూలు మనిషికీ వుంటాయి. వాటిని గుర్తు పెట్టుకోడానికో, మరచిపోడానికో అతనూ యేదో చేస్తాడు. బహుశా, వొక స్నేహితుడి దగ్గిరకెళ్లి భోరున ఏడుస్తాడు లేదంటే కడుపారా నవ్వుకుంటాడు. గుంభనగా వుండే మనిషి అయితే లోలోపలే వుండిపోయి, బయటికి రాలేక తనలో తాను పోరాడుతూ వుండిపోతాడు. కానీ, కవి మామూలు మనిషి కాదు. కవి దగ్గిర కొన్ని పదాలుంటాయి. వాటిని వాక్యాలుగా అల్లే శక్తి వుంటుంది. ఆ శక్తి కొన్ని సార్లు కవిని ఆదుకుంటుంది లేదా కవి మనసుతో ఆడుకుంటుంది. ఆ పదాలతో కవి నిజంగానే తన ఏడుపూ, సంతోషమూ చెప్పచ్చు. లేదంటే, పదాలకు రంగులద్ది మోసం చేయచ్చు. Replacement జరగాలి. అది యెట్లా అయినా జరగచ్చు. అది యెట్లాంటి Replacement?

బాబా అంటున్నాడు:
రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు

మూడు రకాల Replacements – ఇల్లు, దేహం, ఆత్మ! అది తేలిక కాదు. కవికే కాదు, మామూలు మనిషికి కూడా తేలిక కాదు.

## 2

కొంత దూరం నడిచాక కవికి భాష విధించే ఖైదు భారమైపోతుంది.

అంటే, తను వాడుతున్న భాష కటకటాలయం అవుతుంది. ఆ కొద్ది దూరం తరవాత కవి వెతుకులాట అంతా భాష గురించే. భాషని శుభ్రం చేసుకోవాలన్న పట్టుదల పెరుగుతుంది. అప్పుడు ఆ కవి యే భాష వైపు కదులుతాడన్నది అతని

దృక్పథాన్ని బట్టి వుంటుంది. నా మటుకు నేను colloquial అంటే రోజువారీ జీవితం వైపు మళ్లే కవిత్వం మీద వొక రకమైన పక్షపాతం. ఎందుకంటే, సాహిత్య భాషకి ఎదురుగా సాధారణ భాషని నిలబెట్టడం పెద్ద యుద్ధం కాబట్టి!

బాబా మొదట బుద్ధిజీవి. అతనికి స్థానిక చరిత్రలూ, సంస్కృతుల మీద వున్న ఆసక్తీ, పరిశోధనా అనుభవం చాలా మటుకు తన కవిత్వ వ్యక్తిత్వాన్ని కూడా ప్రభావితం చేస్తూ వుంటాయి. అట్లాగే, కవిత్వ విమర్శ మీద గత కొంతకాలంగా నిక్కచ్చిగా గొంతు విప్పి, పరిభాష వెతుక్కుంటున్న poet-critic బాబా. యిక్కడ ఆ రెండు కాళ్లే అనేక పడవల మీదకి వెళ్ళి, నదిని దాటుకొని రావాలని ప్రయత్నించడం మనం ఈ కొంతకాలంగా చూస్తున్నాం. స్థానిక చరిత్రల మీద పనిచేస్తున్న శోధకుడికి వెంటనే నచ్చే మరో సాహిత్య శిల్ప ధోరణి: narration.

Narrative poetry మనకేమీ కొత్త కాదు. అయితే, అత్యాధునిక సందర్భంలో ఈ విధమైన నిర్మాణం వెంట ముఖ్యంగా రెండు ప్రయోజనాలున్నాయి. వొకటి: సంప్రదాయ కవిత్వ శైలిని నిరాకరించడం, రెండు– కవిత్వంలో వొదగని సాంస్కృతిక లక్షణాలను స్వీకరించడం. ఈ రెండు పనులూ చక్కగా చక్కదిద్దుతున్నాడు బాబా.

ముఖ్యంగా– ఈ కొత్త కవిత్వ సంపుటిలో బాబా Narrative poetry కి సంబంధించిన అనేక కోణాలని మనకి పరిచయం చేస్తున్నాడు. బహుశా, ఈ సంపుటి ప్రధానంగా తలపెట్టిన task అదే! పైన చెప్పిన కవితలో ఇతర అంశాలు అనేకం వున్నా, అందులోని narration మనల్ని కట్టిపడేస్తుంది.

కనీసం మూడు రకాల narrative పద్ధతుల్ని బాబా వాడుతున్నాడు. నేరుగా కథనం చేయడం ఇందులో ఎక్కువగా కనిపిస్తున్న పద్ధతి.

ఉదాహరణకు:

జీవించటమే....... అనే కవిత చూడండి:

ఓ రోజు హఠాత్తుగా ఒకదారి తన గమ్యాన్ని మరచిపోయింది. చాలా బెంగ పట్టుకొంది దానికి, గమ్యం లేని జీవితమేమిటని. తన గమ్యాన్ని వెతుక్కొంటూ ప్రయాణం కట్టిందా దారి. కనిపించిన ప్రతి ఒక్కరిని అడుగుతోంది.

యిలా మొదలై ఈ కథ చాలా దూరం వెళ్తుంది. చివరికొచ్చేసరికి బాబా అసలు కథ చెప్తాడు. ఇది నేరుగా కథ చెప్పినట్టే వుండి, కొన్ని జీవన దృశ్యాలను ఆవిష్కరించే ప్రతీకల మీదుగా తుది మజిలీ చేరుకుంటుంది.

ఫ్రాగ్మెంట్స్ అనే శీర్షిక కింద రాసిన శకలాల్లో కూడా కథనాత్మకతే కనిపిస్తుంది. అయితే, ఈ కథనాత్మకత యింకొంచెం గాఢంగా రూపం దిద్దుకుంటుంది.

అందమైన సీతాకోకలు
గాల్లో తేలిగ్గా అలా ఎగిరే దృశ్యం
హాయిగా అనిపించేది
ఒకరోజు
రైల్వే ట్రాక్ పై చెత్త ఏరుకొంటున్న
మురికిబట్టల సీతాకోకను
చూసే వరకూ.....

ఈ కవిత నిజానికి శకలం కాదు. కొద్ది వాక్యాల్లోనే వొక దీర్ఘ కథకి కావలసిన సామగ్రి నింపుకున్న నిర్మాణ చాతుర్యం ఇందులో వుంది. ప్రతి కవీ కొన్ని పాత్రల చుట్టూ తన కథే చెప్తాడు. అయితే, బాబా కవితల్లో పాత్రలకు ఆ ఆత్మకథాత్మకతని మించిన లక్షణాలు కనిపిస్తాయి. ఈ విధంగా సమకాలీన కవిత్వంలో కవులు చేస్తున్న ప్రయోగాలకు భిన్నమైన ధోరణిలో వెళ్తున్నాడు బాబా.

**3**

ఆశ్చర్యం యేమిటంటే, క్రమంగా తెలుగు కవిత్వంలో కవిత్వాన్ని మాత్రమే విశ్లేషించే సాధనాలు లేవు. ఎంతోమంది కవిత్వ విమర్శకులు ఆధునిక కవిత్వ ప్రారంభ దశ నుంచీ వస్తున్నప్పటికీ ఇప్పటికీ కవిత్వ విమర్శ సాధనాలను సృష్టించుకోలేకపోయాం. చేకూరి రామారావు లాంటి వారు భాషాశాస్త్రం కోణం నుంచి చేసిన ప్రయత్నాలు ఆ తరవాత అంతగా అనుసరించిన వాళ్ళు కూడా లేరు. ఆ రకంగా చూస్తే, కవిత్వ విమర్శ పరిభాష మనకింకా ఏర్పడలేదు. అదొకటి ఏర్పడాల్సి వుందన్న ఆలోచన కూడా నెమ్మదిగా పోతోంది.

బాబాలో కవీ, విమర్శకుడూ ఇద్దరూ పుష్కలంగా వున్నారు. వాళ్ళ ప్రపంచాలు అంత భిన్నమైనవేమీ కాదు. అయితే, వాళ్ళిద్దరి మధ్యా సరిగా వంతెన కట్టే విశ్లేషణ ఏదో జరగాల్సిన సందర్భం దగ్గిర పడిందని ఈ కొత్త కవిత్వ సంపుటి చదువుతున్నప్పుడు అర్థమైంది. కవిగా తన దారి ఏమిటో వెతుక్కోడానికి బాబా కవిత్వ విమర్శలోకి వచ్చాడనీ నాకు గట్టిగానే అనిపిస్తుంది.

సృజన అనే కవితలో బాబా అంటాడు:
అంతకు ముందు ఏవి లేవో
వాటిని కొందరు
గొప్ప కాంక్షతో, దయతో
అన్వేషించి
అక్షరాల్లో మరోప్రపంచాల్ని
శిలల్లో భంగిమల్ని
రంగుల్లో ప్రవహించే దృశ్యాల్ని
ఆవిష్కరిస్తూంటారు

ఇది కవిత్వంలో పొదిగిన తన ఆత్మకథ. ఇది బాబా కవిత్వ విమర్శకి కూడా వర్తించే అంశమే. బాబా వొక గొప్ప కాంక్షతో కవిత్వంలోకీ, కవిత్వ విమర్శలోకీ బయలుదేరాడు. వొక సామాజిక శాస్త్రజ్ఞుడిగా అతనికి అన్వేషణా, ఆవిష్కరణ అనే రెండు concepts కూడా తోడవుతున్నాయి. అంతమంది వొక చోట కలిసే బహుళత్వం తెలుగు కవిత్వానికి గొప్ప బహుమతి.

నవంబర్ 27, 2019

**– అఫ్సర్**

# కృతజ్ఞతలు

ప్రేమతో నా కవిత్వాన్ని నాలుగు వాక్యాలతో తడిపిన అఫ్సర్ గారికి

వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ నన్ను ముందుకు నడుపుతూన్న నా సాహితీగురువు శ్రీ శిఖామణి గారికి

ప్రేరణగా నిలిచి, స్ఫూర్తి నిచ్చే శ్రీ దాట్ల దేవదానం రాజు గారికి, శ్రీమతి వాడ్రేవు వీరలక్ష్మీదేవి గారికి , శ్రీ మధునాపంతుల సత్యనారాయణ మూర్తి గారికి,

నన్నెంతో ప్రోత్సహించే శ్రీ గనారా గారికి

అందమైన ముఖచిత్రాన్ని ఇచ్చిన అక్బర్‌కు, వెనుక పేజి రూపొందించిన బాల్యమిత్రుడు చిన్నారికి

ఈ పుస్తకం ఇలా రూపుదిద్దుకొనే ప్రక్రియలో ఎన్నో సూచనలు, సలహాలు ఇచ్చిన శ్రీ సుంకర గోపాల్ కు

ప్రూఫ్‌రీడింగ్ చేసిన సోదరి శ్రీమతి లక్ష్మినాగమణికి

నా భార్య శ్రీమతి సూర్యపద్మ, సోదరులు శ్రీవెంకటేశ్వర ప్రసాద్, దుర్గాప్రసాద్, సోదరిలు పద్మప్రియ, భారతి, మా అమ్మాయి అపరాజిత, అబ్బాయి బసవశ్రీథర్ లకు

ఇంకా –

శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడు, శ్రీ రెంటాల శ్రీవెంకటేశ్వర రావు, శ్రీ యాకూబ్, డా.రాధేయ, శ్రీ జి. లక్ష్మినరసయ్య, శ్రీ సీతారాం, శ్రీ ఆకెళ్ల రవిప్రకాష్, శ్రీ అఫ్సర్, డా.శైలజ కాళ్ళకూరి, శ్రీ పి.ఆర్.ఎల్. స్వామి, శ్రీ మాకినీడి సూర్యభాస్కర్. శ్రీ అద్దేపల్లి ప్రభు, శ్రీ పుప్పాల శ్రీరాం, శ్రీ మార్ని జానకిరామ్ చౌదరి, శ్రీ జోశ్యుల కృష్ణబాబు, శ్రీవత్స రామకృష్ణ, శ్రీ అవధానుల మణిబాబు, శ్రీ చెల్లి రాం, శ్రీ మధునాపంతుల, శ్రీ అనిల్ డాని, డా. హరి రామ్ ప్రసాద్, ఫణి, సారథి, ప్రభాకరరావు, శ్రీ అశోక్ కుమార్, శ్రీ కలిదిండి వర్మ, .... అంతర్జాలంలో నా రచనలను చదివి ప్రోత్సహించే పెద్దలకూ, మిత్రులందరకూ....

భవదీయుడు

**బొల్లోజు బాబా**

# అనుక్రమణిక

ఒక దుఃఖానికి కొంచెం ముందు... 11
కలలు 13
ఒక కవిని కలిసాను 14
వేడుక 16
పిట్టగోడపై వాలిన పిచ్చుక 17
నాలుగు స్తంభాలు 18
భూసేకరణ 20
మేకింగ్ చార్జీలు లేవు 21
ప్రణయం 23
She repeats herself 24
రహస్య ప్రియురాలు 25
నాన్నతనం 26
సిస్టర్ అనామిక 28
చక్కగా ప్రేమించుకోక..... 29
పూడిక 30
బహుళత్వం 31
ఆ మూడు రోజులు .... 32
పదే పదే పునఃసృష్టి.... 33
పరిమళించిన ప్రేమ..... 34
ప్రవహించే వాక్యం 35
మృతుడు 37
సృజన 38
వలసపక్షుల గానం 39
కుట్రలు 40
జీవించటమే... 41
కీమోథెరపీ 43
అయితే ఏంటటా? 44
అదేహ ప్రేయసి 45
మూడు అనుభవాలు 46
భయ్యా! నేనన్నీ గమనిస్తూనే ఉన్నాను 48
రక్తహేల 49
క్షతగాత్ర నది 50
Message in a train 51
నన్ను క్షమించవూ...... 52
A B C D లు 53
చీకటి దిష్టిబొమ్మ 54
ప్రయాణం..... 56
మోహం 58
ముల్లు తీయించుకోవటం 59
ఒక....పురా.... ప్రకాశం.... 61
Brain in a Jar 62
Alone but Together.... 64
బిక్కచిక్కిన ప్రశ్న వొకటి.... 66
దుఃఖ ద్వారం 68
సమాధానం 69
ఒక apocalypse అనంతరం.... 71
గాయాల శ్వాస 73
ఏం పని ఉంటుంది నీకూ .. 74
నివేదన 76
ఆట 77
అధికారం 78
గీత 79
ఇకపై... 80
అస్తిత్వం 81
సెల్ఫీ 82
పూలతోట 83
మా నాన్నా – నేనూ 85
ఎలా బయటపడగలవ్? 87

మహా నగరం 88
సోషల్ ఇంజనీరింగ్ 89
గులకరాయి 90
స్త్రీ 92
Personal 93
చిట్టి కురువి 94
తదుపరి ఎత్తు? 96
కోరంగి మాంగ్రోవ్స్.... 98
అంధుని ఇంద్రధనుసు .... 100
వలస పోవటం.... 102
ప్రేమ... 104
ఉదయకాంతి 105
గురుదేవులకు వందనాలు 107
పాఠం 109
పట్నం కన్నీరు.... 110
Skin Trade 111
ఎవరు వీళ్లంతా? 112
ఫ్రాగ్మెంట్స్ 114
ఫ్రాగ్మెంట్స్ 116
ఫ్రాగ్మెంట్స్ 118

## ఒక దుఃఖానికి కొంచెం ముందు...

అప్పటికింకా అతను
చెట్టుకొమ్మకు పిడికెడు మట్టై
వేలాడలేదు
చేనుగట్టుపై కూర్చొని
ఎండిన పంటను
ఓదారుస్తున్నాడు, ఇసుక
నిండిన హృదయంతో.
..
అప్పటికింకా అతని భార్యలో
సగభాగం ఖననం
చేయబడలేదు
కళాయిపోయిన అద్దంలో
చూసుకొంటూ నుదుటిపై
సూర్యబింబమంత కుంకుమ దిద్దుకొంటోంది.
..
అప్పటికింకా ఆ చీర
ఉరితాడుగా మారలేదు
ఒక్క ఉతుకు వానకే
రంగువెలసిన ఆకాశంలా
దండంపై వట్టిపోయి వేలాడుతోంది
..

అప్పటికింకా ఆ చెట్టుకొమ్మ
ఉరికంబం పాత్రను
ధరించలేదు
పక్షిగూడు దిశగా పాకుతున్న
పామును
శ్రద్ధగా చూస్తోంది.
..
అప్పటికింకా ఈ ప్రపంచానికి
తెలీదు
రేపు ఉదయం ఒకడు దాని
నాగరికత అంతా ఒక కుట్ర అని
ప్రకటించబోతున్నాడని.
ఏ దోషం చేయనిదానిలా
ప్రశాంతంగా నిద్రిస్తూంది.

3 June 2017

## కలలు

జీవితం అనే పదునైన కత్తి
కాలాన్ని
ఆఫీసు, అనుబంధాలు, స్వప్నాలుగా
ముక్కలు ముక్కలు చేసి వడ్డిస్తుంది.

దినాంతాన
స్వప్నాలు మాత్రమే
మన జేబులో మిగిలే
చివరి చిల్లర నాణేలు

29 August 2016

## ఒక కవిని కలిసాను

పరవళ్ళు తొక్కుతూ నినదించి నినదించి
ప్రవహించినంత మేరా పచ్చదనాన్ని పోటెత్తించి
ప్రశాంతంగా కాల సముద్రంలో కలిసే
నది లాంటి ఒక కవిని కలిసాను

ఎముకల్ని కప్పుతూ వెలుతురు పొరలాంటి
ముడుతలు పడిన మెత్తని చర్మం.
ఆ దుర్బల దేహంలో ఇంకా మిగిలే ఉన్న
కొన్ని రక్తపు చుక్కల వెలుగు అది.

అతని చేతిని నా చేతుల్లోకి తీసుకొన్నాను
పావురం కన్నా మెత్తగా
నీరెండ కన్నా వెచ్చగా
కవిగా బ్రతికిన క్షణాల వాసన వేస్తూ
అతని చేయి.

ఒకనాటి ప్రయాణాలు, కొన్ని మార్గాలు
మరికొన్ని సంధ్యలు
సన్నని సెలయేరై ప్రవహించాయి మా చేతుల మధ్య
ఏదో అదృశ్య వాగ్దానం గలగలమంది.

రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు
కానీ తన పేరులో సజీవంగా ఉంటాడు

ఇన్ని సంవత్సరాల జీవితాన్నీ
తన పేరులో దాచుకొన్నాడు
అక్షరాలుగా, వాక్యాలుగా, కవిత్వంగా.....

పసుపుపచ్చని ఎండుటాకులాంటి
అతని చేయి నా చేతుల్లోంచి
మెత్తగా జారిపోయింది
గడియారంలోని ఇసక ధారలా

చిన్నపిల్లలు వేసిన ముద్దుముద్దు రంగుల చిత్రమై
నవ్వుతూ వీడ్కోలు చెప్పిన
పువ్వులాంటి ఒక కవిని కలిసాను నేను.

24 August 2016

## వేడుక

పాపం పసివాడు
లోకం
ఎదురుపడ్డప్పుడల్లా
శోకంతో
కన్నీరు మున్నీరయ్యేవాడు

వాడి బాధ చూడలేక
ఓ దేవత వాడి నేత్రాలపై
బీజాక్షరాలను లిఖించి
కన్నీటి బిందువులను కవిత్వంగా మార్చే
వరమిచ్చింది

విషయాన్ని పసికట్టినలోకం
మరిన్ని దృశ్యాలను
అతని కళ్ళలోకి వంపి
కవిత్వాన్ని పిండుకొంటోంది
వేడుకగా

17 April 2017

## పిట్టగోడపై వాలిన పిచ్చుక

నువ్వింకా బతికే ఉన్నావా?
చక్రాన్ని కనిపెట్టిన ఆదిమానవుని కుతూహలం
నీకెంత కష్టం తెచ్చిపెట్టిందీ!

ఎలక్ట్రాన్‌లకు
దేహాల్ని ఆత్మల్నీ అప్పగించిన
కాలంనిండా ఇనపవాసన
ఎవరెవరి లాభాలకోసమో
రక్తం కక్కుకొంటోన్న కాలం
ఎక్కడున్నామో తెలీదు
ఎక్కడకు కొట్టుకుపోతున్నామో
అంతకన్నా తెలీదు
తోకకు దారం కట్టిన తూనీగ
రెక్కల తపతపల శబ్దం అంతటా

పిచ్చుకా!
నిన్నటిదాకా నీవు ప్రయాణించిన మార్గాన్నీ
పడిలేచిన నీ ఆత్మనీ చూడాలనిపిస్తోంది
కొత్త రహస్యాలేమైనా బోధపడతాయేమో!

ఇద్దరమూ ఒకే నాగరికతా వేటుకు
తెగిపడ్డ దేహాలం కదా!

(చాన్నాళ్ల తరువాత కనిపించి ఆశ్చర్యపరచిన ఒంటరి పిచ్చుకను చూసాకా)

6 July 2016

## నాలుగు స్తంభాలు

మొన్నో నలుగురు వ్యక్తులు
కొండపై రాత్రివిందుచేసుకొన్నాకా
ఉదయానికల్లా కొండ మాయమైందట

ఆ నలుగురే
నదీవిహార యాత్రజరిపిన మర్నాటికల్లా
నదీ, నదీ గర్భపు ఇసుకా అదృశ్యమయ్యాయని
ఆశ్చర్యంగా చెప్పుకొన్నారు

వాళ్ళే
చెట్టపట్టాలేస్కొని పంటచేలల్లో
తిరుగాడిన సాయింత్రానికల్లా
పచ్చని చేలన్నీ కనిపించకుండా పోయాయట

ఈరోజు వాళ్లకో కొత్త ఊహ పుట్టిందట
అందరూ గుసగుసలుగా చెప్పుకొంటున్నారు.
వివరాలింకా బయటపడలేదు

ఇంతలో
'అలా జరగటానికి వీల్లేదు" అంటూ
రోడ్డుపై ఒకడు గొణుక్కుంటూ
గాల్లో ఏవో రాతలు వ్రాసుకొంటూ

అడ్డొచ్చిన నన్ను తోసుకొని సాగిపోయాడు
ఎలా జరగటానికి వీల్లేదటా? అని ఆలోచించాను

వెంటనే స్ఫురించింది
అవునవును
నాకూ అన్పిస్తోంది
ఖచ్చితంగా అలా జరగటానికి వీల్లేదు

5 April 2017

## భూసేకరణ

భూమంటే విద్యుత్ కాంతుల్లో
బెల్లీడాన్స్ చేసే ఆటకత్తె – వాడికి

భూమంటే నొసటన దిద్దుకొనే
ఆకుపచ్చని వీభూతిపండు – వీడికి

యుద్ధానంతరం
భూమికి మాత్రం వీరిద్దరూ
ఓ ఆరడుగుల బాధ్యత ....

6 August 2016

# మేకింగ్ చార్జీలు లేవు

ఈ రోజు మార్కెట్ సెంటర్ లో
మహాకవి కనిపించాడు.
గాల్లో ఏదో వ్రాస్తున్నట్లు వేళ్ళు తిప్పుతూ
తనలో తనే ఏదో మాట్లాడుకొంటూ
ఓ విస్మృత సామ్రాజ్యంలా నడుచుకుపోతున్నాడు.

మార్కెట్ నిండా మహాకవి పద్యాల్ని
చైనా వస్తువుల్లా కుప్పలు పోసి అమ్ముతున్నారు.
ఎవరో కుర్రవాడు మహాకవి వెంటబడి
"సార్ తీసుకోండి సార్, నాణ్యమైన కవితలు సర్"
అంటూ ప్రాధేయపడుతున్నాడు.
"పొద్దున్న నుంచీ ఏమీ తినలేదు సర్" అరచాడా కుర్రవాడు
"నేనుకూడా" అని గొణుక్కుంటూ సాగిపోయాడు మహాకవి.

నియాన్ లైట్ల వెలుగులో షాపుకు వేలాడదీసిన
కవిత్వ పుస్తకాల్ని చూస్తూ ఓ క్షణం ఆగాడు మహాకవి
"రండి సార్ రండి నిన్నే వచ్చిన సరుకు"
అంటూ షాపువాడు పిలుస్తున్నాడు.
మహాకవి వడివడిగా ముందుకు కదిలాడు.

మహాకవి కవిత్వ ఆథరైజ్డ్ షో రూమ్ వద్ద
క్యూలైన్ కొంచెం కొంచెం పెద్దదవుతూంది.

ఒకనాటి మహాకవి సెక్యూరిటీ గార్డు వేషమెత్తి
షోరూమ్ కి కాపలా కాస్తున్నాడు.

మేకింగ్ చార్జెస్ లభించక
చెట్టుకొమ్మకు వేలాడిన ఎండిన పంటలా
మేకింగ్ చార్జెస్ లభించక
దూలానికి ఉరిబిగించుకొన్న నూలు పోగులా
మేకింగ్ చార్జెస్ లభించక
ద్రావకపు చెరువులో శవమై తేలిన స్వర్ణకారునిలా
మహాకవి
తన బరువుతో తానే కృంగిపోయిన ఈ వృద్ధలోకానికి
అక్షరాలతో ఆయుష్షును పోస్తున్నాడు

"బ్రహ్మాండమైన ఆఫర్
మేకింగ్ చార్జీలు లేవు మహాప్రస్థానం 2.0" అంటో
వీధిమలుపు వద్ద రంగురంగుల హోర్డింగ్
విద్యుత్ కాంతులలో వెలిగిపోతోంది.

కొంతమంది యువకులు మహాకవిని గుర్తించి
అతనితో సెల్ఫీ తీసుకోవటానికి ప్రయత్నిస్తుంటే
"నేను కాదు, నాకేం తెలీదు" అంటూ వారిని తప్పించుకొని
జారిపోయిన ఫాంటును పైకి లాక్కుంటూ
గుంపులో కలిసిపోయి మాయమయ్యాడు.

26 September, 2016

## ప్రణయం

అంతవరకూ
ఇరుకిరుగ్గా ప్రయాణించిన కెరటం
తీరం పెదాలపై
నురగ పువ్వులుగా విచ్చుకొంది
నీటి నవ్వులుగా పరుచుకొంది.

బొరియలోకి దూరింది కుర్రపీత
భూమిని మరోసారి ప్రేమించటానికి

22 July 2016

## She repeats herself

“ఈ ఫొటోలో ఉన్నది
ఎవరో చెప్పు చూద్దాం” అంటూ
తన ఆరేళ్ళవయసు నాటి
ఫొటోను చూపుతూ అడిగిందామె
తన మూడేళ్ళ కూతుర్ని

“నేనే కొంచెం పెద్దయ్యాకా”
అందా పాపాయి తడుముకోకుండా

14 December 2016
(కొప్పర్తి కవిత ప్రేరణతో)

## రహస్య ప్రియురాలు

నాకెప్పుడో
ఇసకలో దొరికిన గవ్వతో
ఏకాంతం దొరికినప్పుడల్లా
మాట్లాడుకొంటాను.

తనకే అర్థమయ్యే భాషలో
పాటలు పాడి వినిపిస్తాను.
మాకు మాత్రమే వినబడే
శబ్దాలతో గుసగుసలాడుకొంటాం

సముద్రం పెదవిపై
గవ్వా నేనూ ఒక్కోసారి
జంటగువ్వలమౌతాం.

నాకెప్పటినుంచో ఓ అనుమానం
మమ్మల్ని ఎవరో గమనిస్తున్నారని!

# నాన్నతనం

అమ్మతనాన్ని గుర్తించటం కొంచెం కష్టం కానీ
రోడ్డుపై అడుగడుగునా ఎదురయ్యే
నాన్నతనాన్ని సులువుగానే పోల్చుకోవచ్చు.

పార్కులో రెండుచేతుల్తో పీచుమిఠాయో
పల్లీలపొట్లాలో తీసుకెల్తూ కనిపించవచ్చు.
సినిమా హాలులో రెండో మూడో కూల్ డ్రింకులో
ఐస్ క్రీములో పట్టికెల్తూ ఎదురవ్వొచ్చు.
ఇంటికెళ్ళే వేళ స్వీట్ కొట్లోనో, ఫ్రూట్ షాపులోనో
ఏవో పొట్లాలు కట్టిస్తూ తారసిల్లవచ్చు.

ఏ పేవ్ మెంటు మీదనో
స్కూల్ బేగ్గో, షూసో కుట్టిస్తూ కంటపడొచ్చు.
నాన్నతనాన్ని బజార్లో ఎక్కడున్నా
ఇట్టే గుర్తు పట్టేయవచ్చు
"సైజులు సరిపోకపోతే మారుస్తారు కదూ"అంటో
పిల్లల బట్టల షాపులోనో;
స్కూల్ విడిచాకా వస్తూన్న పిల్లల గుంపులోంచి
"డాడీ" అన్న పిలుపు వచ్చిన వైపు అసంకల్పితంగా
చూసే అయిదారు జతల ఆతృత నేత్రాలలోనో;
"అన్నీ పట్టుకెళుతున్నావా" అని వందోసారి

అడుగుతూ ఎగ్జామ్ సెంటర్ వద్దనో...
ఎక్కడయినా సరే
నాన్నతనం తేలిగ్గానే దొరికిపోతుంది.

పిల్లలు కాలేజీ చదువులకై ఇల్లువిడిచాకా
వారి సెల్‌ఫోన్లో ఒక నంబరుగా మిగిలిపోతుంది నాన్నతనం
శుభాకాంక్షల్ని, జాగ్రత్తలను క్రమం తప్పకుండా అందుకొంటూ.

అప్పుడు కూడా
పార్కు బెంచీపై కూర్చొని మిత్రులతో
కొడుకు సంపాదన, కోడలి మంచితనం
మనవల అల్లరిని కళ్లకు కట్టినట్లు వర్ణిస్తూ
కనిపిస్తుంది.......... నాన్నతనం.........

కొన్ని నీటి పొరలేవో కంటికడ్డు పడినప్పటికీ

13 February 2017

# సిస్టర్ అనామిక

అతని
రెండు రెక్కల్లో చేతులు ఉంచి
టాయిలెట్ సీట్ నుంచి లేపి
పళ్ళుతోమి స్నానం చేయించి
ఒళ్ళుతుడిచి బట్టలు తొడిగి
జాగ్రత్తగా నడిపించి
మంచంపై పడుకోబెట్టి
"మీ అబ్బాయి రమ్మంటున్నాడని అన్నారుగా
వెళ్ళొచ్చు కదా?" అందామె
మాత్రలు వెతుకుతూ

నీటిపొర నిండిన కళ్ళతో
సీలింగ్ కేసి చూస్తూ ఉండిపోయాడతను
ఫోన్ కూడా చేయటం మానుకొన్న
బబ్లూ గాడిని గుర్తుచేసినందుకు.

14 January 2017

## చక్కగా ప్రేమించుకోక.....

పాపాయిని ఎత్తుకొన్నాను
నేను నచ్చలేదేమో
దూదిలాంటి మెత్తని చేతుల్తో
నా మొఖాన్ని తోసేస్తుంది
పలుచని గోళ్ళతో నా బుగ్గల్ని గిల్లుతోంది
కాళ్లతో తన్నుతోంది
వాళ్ళమ్మకు ఇచ్చేసాను

తను ఎత్తుకొన్నాక
సొట్టబుగ్గలతో బోసినోటితో
నన్ను చూస్తూ నవ్వుతోంది పాపాయి.

ఒక్కసారిగా అనిపించింది
తిరస్కరించిన తరువాత
ద్వేషించక్కర లేదని
చక్కగా ప్రేమించుకోవచ్చనీ!

28 January 2017

## పూడిక

పెద్ద యంత్రం తొండంతో
చెరువు పూడిక తీస్తోంది
గతాన్ని  పొరలు పొరలుగా
తొలగించి పారేస్తోంది.

రేపో మాపో
చెరువులోకి కొత్తనీరు ఎక్కుతుంది
సృష్టి అపూర్వ రాగాన్ని ఎత్తుకొంటుంది
కొత్త చేపలు  కిలకలు వేస్తాయి
తామర దుంపలు కొత్త మోసులెత్తుతాయి
కెరటాలు నురగలై తిరగబడతాయి

గుండె నిండా
అస్ఖలిత వీర్యాలు, అవాంఛిత స్వప్నాలు
చెరగని మరకలు, విరిగిన వాక్యాలు
ఘనీభవించిన కన్నీరు.

గుండె పూడిక ఎవరైనా తీస్తే బాగుణ్ణు!

30 January 2017

## బహుళత్వం

అందరూ సమానమే అన్న
ప్రాతిపదికన ప్రయాణం మొదలెడతాం
ఒకే బాటగుండా వచ్చినందుకు.

కొంతకాలం గడిచాకా
నిన్ను నన్నూ విడదీస్తున్న
తెరలేవో లీలగా తెలుస్తూంటాయి.

నువ్వెవరైతే నాకేంటి
ఇద్దరి రక్తాలు ఒకటే ఆకాశం కదా అంటూ
వాదిస్తాను ఒకానొక ఉద్విగ్న క్షణంలో

నీళ్లను వేరుచేస్తుంది జీవితమనే హంస
దాని తూలికల అంచులవెంబడి
రక్తం బొట్లు బొట్లుగా ........

చివరకు
నువ్వు నీ నువ్వుగా, నేను నా నేనుగా
స్పష్టమౌతాం

26 January 2017

## ఆ మూడు రోజులు ....

కొలతలుగానో మమతలుగానో
చూడబడే ఆమె
నెలకో మూడురోజులు
ఓ రక్తగర్భ అనీ
రక్తాశ్రువులు చిందించే
ఓ గాయగర్భ కూడా అని
మాట్లాడుకోవాల్సిన సమయం వచ్చింది.

ఋతుమతి, పుష్పవతి
ఏకవస్త్ర, త్రిరాత్ర అంటూ
సౌందర్యాత్మక భాషలో కప్పెట్టిన
కొన్ని దైహిక రహస్యాల పట్ల
అసున్నితత్వం పొందాల్సిన సమయం వచ్చింది

ఇన్‌సెనిరేటర్ లోకి విసిరిన
సానిటరీ నాప్కిన్ తో పాటు
కొన్ని బిడియాల్ని, సంకోచాల్ని
వదిలించుకోవాల్సిన సమయం వచ్చింది
ఆమెక్కూడా!

24 June 2017

## పదే పదే పునఃసృష్టి....

ప్రతీదీ ఏదోఒకదానిలోకి
తెరుచుకొంటుంది.
కిటికీ ప్రపంచంలోకి
ప్రపంచం అసమానతల్లోకి
అసమానతలు రక్తంలోకి
రక్తం తిరుగుబాటులోకి
తిరుగుబాటు భానూదయంలోకి
భానూదయం కిటికిలోకి

ప్రతీదీ ఏదో ఒకదానిలోకి
తెరుచుకొంటూనే ఉంది అనంతంగా....

14 March 2017

## పరిమళించిన ప్రేమ.....

ఖాళీ రేకుడబ్బాలో మట్టి నింపి
గులాబి మొక్కను పెంచుతోంది మా అమ్మాయి
స్కూలునుంచి వచ్చాకా
దానికి నీళ్ళు పోస్తూ, ఆకుల్ని సుతారంగా
నిమురుతూ మురిసిపోతుంది.
మొగ్గలేమైనా వచ్చాయా అని ప్రతిరోజూ
జాగ్రత్తగా పరిశీలిస్తుంది

“ఏ రంగు గులాబీలను పూస్తుంది
ఇంకా ఎన్నాళ్ళు పడుతుంది” అంటూ
వాళ్లమ్మను ఆరాలు తీస్తుంటుంది .

ఒక రోజు
తనకు బిగుతైన గౌనుల్ని బ్యాగ్గులో పెట్టుకొని
స్కూలుకు తీసుకెళ్ళింది ఏదో చారిటీ ప్రోగ్రాం అంటూ.

మర్నాడు ఉదయం ఒక గులాబీ
నవ్వుతూ ప్రత్యక్షమయ్యింది ఆ మొక్కకు.
చప్పట్లు కొడుతూ ఆనందిస్తోంది మా అమ్మాయి
ఆ దృశ్యాన్ని

బహుశా ఎక్కడో ఎవరో ఓ పాప
తనకు సరిగ్గా సరిపోయిన గౌనును చూసుకొని
మురిసిపోయినప్పటి ఆనందం కావచ్చు
ఆ గులాబీ.

17 March 2017

## ప్రవహించే వాక్యం

మొన్న లైబ్రెరీ వద్ద  నేనెంతో
ఆరాధించే  వాక్యమొకటి కనిపించింది
దివ్యతేజస్సుతో వెలిగిపోతూ.
పరిచయం చేసుకొన్నాను
నిర్మాణ వ్యూహాల గురించి చాలాసేపు మాట్లాడుకొన్నాం

ఇపుడు బలంగా వీస్తోన్న పరిణామాల ప్రస్తావన వచ్చింది
మానిన నా గాయాల గురుతుల్ని చూసింది
కొత్తగాయాల పచ్చిదనాన్ని పరికించింది
ఏమీ మాట్లాడలేదు
వాతావరణం ఒక్కసారిగా  గంభీరంగా మారిపోయింది.

"నా తలకు వెల కట్టారని తెంపుకు పోయారెవరో"
అంది నెమ్మదిగా
అపుడు చూసాను
దాని తల స్థానంలో  మాస్క్ లాంటిదేదో ఉంది
తన చేతిని స్పృశించబోయాను అనునయంగా
చేయి లేదు! దుస్తుల వెనుక దేహమే లేదు ఆశ్చర్యంగా
"అప్రియ సత్యాలు చెప్పినందుకు నా దేహాన్ని
బూడిద చేసారు" అంది.

అయినా సరే
అనల ప్రవాహమై
మట్టి కన్నీరు తుడుస్తాను
నిప్పుల సుళ్ళు తిప్పుకొంటూ
కాల రక్తాన్ని పర్వులెట్టిస్తాను
చీకటి కోనల్లో వెల్తురు పదచిత్రాలుగా వర్షిస్తాను

నాకు చాలా పని ఉంది ఉంటా......నేస్తమా!

నువ్వూ నాతో రాగలవా?

13 September 2017

# మృతుడు

అంత్యక్రియలు పూర్తిచేసి ఇంటికొచ్చేసరికి
సోఫాలో కూర్చొని పాత ఆల్బమ్ లు తిరగేస్తూ కనిపించాడు
ఆశ్చర్యం నుండి తేరుకొనేలోగా మాయమయ్యాడు

ఆ తరువాత ఎన్నోసార్లు కనిపించాడు
డైజిపామ్ కి కూడా నిద్ర పట్టక దొర్లుతూంటే
తన బొజ్జపై నన్ను పడుకోపెట్టుకొని
కథలు, పద్యాలు తన చిన్ననాటి సంగతులూ
చెపుతూండగా మధ్యలో ఎపుడో నిద్ర పట్టేసేది.

"చంటాడికి ఒళ్ళు కాలిపోతోంది" అంటూ
నన్ను భుజాలపై వేసుకొని ఆరుబయట తిప్పుతూండగా
మా అమ్మాయి నా నుదిటిపై చేయివేసి
"ఏమైంది నాన్నా" అనేది చాలాసార్లు.

నదిలో తన ప్రతిబింబాన్ని చూసుకోవటానికి
ఇక్కడిక్కడే తిరుగుతున్నాడని అనిపించేది.

ఇపుడెవరూ నమ్మటం లేదు కానీ
రేపెపుడో నేనూ అలా కనిపించినపుడు
నమ్ముతారు బహుశా!

5 September 2017

## సృజన

ఏవి
అంతకు ముందు లేవో
వాటిని కొందరు
గొప్ప కాంక్షతో, దయతో
అన్వేషించి
అక్షరాల్లో మనోప్రపంచాల్ని
శిలల్లో భంగిమలని
రంగుల్లో ప్రవహించే దృశ్యాలను
ఆవిష్కరిస్తూంటారు

వాటిని కొందరు
గొప్ప విభ్రమతో, లాలసతో
అలా చూస్తూనే ఉండిపోతారు
ఏనాటికీ

20 August 2017

## వలసపక్షుల గానం

రద్దీట్రాఫిక్ లో
రెండు చీమలు కలుసుకొని
కాసేపు ముద్దులాడుకొని
విడిపోయినట్లుగా మనమూ
కలుసుకొని విడిపోతూంటాం.

ఉద్యోగమో, వివాహమో, అనంతశయనమో
ఏదైనా కానీ
కలయికను లోపలనుంచి తొలిచి
వియోగ శిల్పాన్ని సృష్టించే అద్భుత శిల్పులు.

ఎప్పుడు కలుసుకొన్నామో
సమయాలు సందర్భాలు ఉంటాయికానీ
ఎప్పుడు ఒకరి హృదయంలో ఒకరు
మనుష్యులమై మొలకెత్తామో
తారీఖులు దస్తావేజులు ఉండవు

ఎందుకు కలుసుకొన్నామో
కారణాలు అవసరాలు తెలుస్తుంటాయికానీ
ఎందుకు ఒకరి దూరం
దిగంతాలవరకూ పరుచుకొనే దుఃఖం
అవుతుందో ఎన్నటికీ తెలియదు

నదిలో కొట్టుకు పోతున్న దుంగపై
కాసేపు వాలి
పేరు, ప్రవర చెప్పుకొనే వలసపక్షులు
చేసే గానమిది.

7 July 2017

## కుట్రలు

చిన్నప్పుడు
మా ఇంట్లో పాడి ఉండేది
కనుమ రోజున మా అమ్మ
ఆవుకు పసుపు, కుంకుమ పూసి
గిట్టలకు బంతిపూల దండలు కట్టి
చుట్టూ ప్రదక్షిణ చేసి, హారతి ఇచ్చి
భక్తిశ్రద్ధలతో పూజ చేసేది
బతిమాలో బామాలో ఉద్దరిణిడు
గోమూత్రం రాబట్టి తలపై చల్లుకొనేది

అదే ఆవు
ఒంటిపూట పడి క్రమంగా ఒట్టిపోతే
కబేళా బేరగాడితో గీసి గీసి బేరమాడి అమ్మేసి
మరో ఆవును తెచ్చుకొనేది.

***

ఇపుడీ దేశానికి ఏమైంది
ఎవరిని వధశాలకు పంపటానికి
ఇన్ని కుట్రలు పన్నుతోంది?

9 June 2017

## జీవించటమే.......

ఓ రోజు హఠాత్తుగా ఒకదారి తన గమ్యాన్ని మరచిపోయింది. చాలా బెంగ పట్టుకొంది దానికి, గమ్యం లేని జీవితమేమిటని. తన గమ్యాన్ని వెతుక్కొంటూ ప్రయాణం కట్టిందా దారి. కనిపించిన ప్రతి ఒక్కరిని అడుగుతోంది.

పిట్టల్ని పెంచే కులవృత్తిని కోల్పోయి ఏదో ఫాక్టరీలో వాచ్ మెన్ గా పనిచేస్తున్న ఓ ముసలి చెట్టును అడిగింది "నా గమ్యాన్ని ఎక్కడైనా చూసావా" అని. "తూర్పువైపున బోల్డన్ని గమ్యాలుంటాయని మా పూర్వీకులు చెప్పేవారు ఆ వైపు ప్రయత్నించు" అంది ఆ చెట్టు. అటుగా కదిలింది. పొద్దున్నుంచీ ఏమీ తినలేదేమో నిస్సత్తువ ఆవరిస్తోంది.

ఎదురుపడ్డ ఒక ఎర్రనత్తను అడిగితే "నన్ను అనుసరించు" అంటూ వెనుకకు నడవటం మొదలెట్టింది. దారికి దాని వాలకంపై అనుమానం వేసి ముందుకు సాగింది.

చీకటి పడింది. అడవి గుండా ప్రయాణం. ఏవేవో జంతువుల అరుపులు వినిపిస్తున్నాయి. దారికి భయం వేసింది. అయినా సరే గమ్యాన్ని కనుక్కోవాలన్న నిశ్చయం సడలలేదు. ఆకలి చలిలా కొరుకుతుంది.

కొందరు దారిదోపిడి దొంగలు పొదలమాటునుండి మీదపడి దారిని బంధించారు. ఓపికలేక ప్రతిఘటించలేకపోయింది. గమ్యం లేదని గమనించి ఒదిలేసి వెళ్ళిపోయారు వాళ్ళు.

తెల్లారింది. నెమ్మదిగా అన్వేషణ కొనసాగించింది దారి. ఏదో ఊరు కనిపించింది. పాత ఫ్లెక్సిలతో చేసిన గూళ్ళలో మనుషులు జీవిస్తున్నారు. వస్తూన్న ఒక వ్యక్తిని దాహం అడిగింది. నీళ్ళు తాగుతూ అతన్ని చూసింది. ఒక కాలు లేదు అతనికి. ఏమైంది అని ప్రశ్నించింది. "రైల్లో పల్లీలమ్ముతాను, ఓ రోజు ఆక్సిడెంట్ అయ్యింది" అన్నాడు. అతని లేని కాలును చేతిలోకి తీసుకొని తడిమింది. కన్నీళ్ళు వచ్చాయి. ఆకలి వల్ల ఎక్కువ బాధపడలేక పోయింది.

వెళ్ళిపోతున్న అతని వెనుక చేరి బుట్టలోంచి గుప్పెడుపల్లీలలను దొంగిలించి గబగబా నోట్లో కుక్కుకొంది. రైలుపట్టాలకు అంటుకొన్న రక్తం జ్ఞాపకాలు గొంతుకడ్డుపడ్డాయి.

కుంటుకొంటూ పడమరవైపు వెళుతోన్న అతన్ని చూస్తుంటే అర్థమైంది గమ్యం అంటే ఏమిటో.

ఇంకెప్పుడూ అది గమ్యం కొరకు అన్వేషించలేదు.

23 April 2017

## కీమోథెరపీ

ఇంట్లోకి ఇంకా అడుగుపెట్టనే లేదు
తల వెంట్రుకల చుట్ట
బండి చక్రంలా గాలికి
దొర్లుకొంటూ దొర్లుకొంటూ వచ్చి
గడప వద్ద ఆగింది

పెను దుఃఖం
ఒక ఆలింగనం
ఎడతెగని కన్నీరు
వెంట్రుకల్ని ఒక్కొక్కటీ
రాల్చుకొంటూన్న తరువు
మెల్లమెల్లగా
గతంలోకి కూరుకుపోతోంది.

కటిక రాత్రి
జుట్టుపట్టుకొని ఈడ్చుకుపోతూంటే
తెగిన చీకటి దారాల్లా వెంట్రుకలు
ఎల్లెడలా మృత్యుశైత్యం

ఒక వేదన
భయప్రవాహం
విచ్చుకొన్న ఓదార్పు తెరచాప

7 April 2017

అయితే ఏంటటా?

అవును నిజమే
చీరకింద తలగడ ఏదో కుక్కుకొని
నెలలునిండిన దానిలా
నటిస్తూ అడుక్కొంటోంది ఆమె.
జనాల్ని ఎమోషనల్ బ్లాక్ మెయిల్ చేస్తుంది... తప్పే!

పాయింటుబ్లాంకులో
నీ సంతకాలు పెట్టించుకొందా లేక
ఉపాధికల్పన పేరుతో నీ భూములు లాక్కొందా?

నీకులాంటి జరుగుబాటు లేనివాళ్ళు
చచ్చిపోవాలా ఏమిటీ?

19 March 2017

## అదేహ ప్రేయసి

నీ జ్ఞాపకాలు నిండిన రాత్రివేళ
నిర్నిద్ర దేహం
అస్వప్న జలాలలో పయనించే
గూటి పడవ అవుతుంది.

నీ రూపం, నీ నవ్వు, నీ వీడ్కోలు
నా మూసుకొన్న కనురెప్పల వెనుక
అద్దం ముందు పిచ్చుకలా
రెక్కలు ఆడిస్తూ, పొడుస్తూ,
మిథ్యా ప్రియునితో రమిస్తున్నాయి

బయటకి వెళ్ళిపోండి అని
చెప్పాలనుకొంటాను వాటితో
ఈ భారాన్ని నేను మోయలేను
అని అరవాలనుకొంటాను.
నీ చుంబనంలో బంధీ అయిన
నా పెదవులు తెరుచుకోవు.
నా గొంతులో కూడా
నువ్వే చిక్కుకొని ఉన్నావు.

31 October 2017

## మూడు అనుభవాలు

ఒక చెవిటివానికి
కోయిల పాట ఎలాఉంటుందో వినాలనిపించింది.
ఓ కవిమిత్రుణ్ణి అడిగాడు
గులాబిపూవులా ఉంటుందన్నాడు.
ఒక అందమైన గులాబీని చెవి వద్ద ఉంచుకొన్నాడు
మెత్తని  పరిమళ స్వరం
గులాబి ముళ్ళు చెవితమ్మెల్ని గాయపరిచాయి
చేతికి రక్తం వెచ్చగా తగిలింది
అనామక కాకి రక్తం

****

ఒక అంధునికి
ప్రేమ ఎలా ఉంటుందో చూడాలనిపించింది
సాగరంలా ఉంటుందన్నాడో మిత్రుడు
వెంటనే సముద్రంలో దూకేసాడతను
గవ్వలు, రాళ్ళు గుచ్చుకొని గాయాలయ్యాయి
లోతుల్లోకి కూరుకుపోతూంటే
ఒక సముద్రగుర్రం తన వీపుపై ఎక్కించుకొని
ఒడ్డున దీబెట్టింది
ప్రేమంటే అర్థమైందతనికి

****

ఒక మూగవానికి
దేవుడు కనిపిస్తే ఏం మాట్లాడాలన్న సందేహం వచ్చింది
చిమ్మెట శబ్దాలలో నీకు సమాధానం లభిస్తుందన్నారెవరో
చిమ్మెటలు కిక్కిరిసిన తోటలో
ఎన్నోరాత్రులు ఓపికతో ఒంటరిగా ఎదురుచూసాడతను

ఓ వేకువ జామున
దేవుడు అతనితో సంభాషించాడు.

27 October 2017

## భయ్యా! నేనన్నీ గమనిస్తూనే ఉన్నాను

ఇన్నేళ్ళ మా స్నేహంలో
ఇటు పులిహోర బూరెలు అటు
అటు సేమియా బిర్యానీలు ఇటూ ప్రవహిస్తూనే ఉన్నాయి

ఇద్దరం ఒకే యజమాని కింది కూలీలమేమో
ఈ ఇంటిపై వాలిన సుఖఃదుఖాలు ఆ ఇంటిపై కూడా వాలేవి

మా ఇరవై ఏళ్ల సహవాసంలో
అతని కళ్ళల్లో ప్రేమనే తప్ప భయాన్నెప్పుడూ చూడలేదు

కానీ
మొన్న జండాల పండుగరోజున
మైకులో “వందేమాతర గీతం” వస్తూంటే దాన్ని
కూడబలుక్కుంటూ
వచ్చీరాని ఉచ్చారణలో వణుకుతూ అందరికీ వినబడేలా
అతను పైకి పాడటం చూసాకా నాకు భయం వేసింది

దీన్ని
ఇంకెంత దూరం తీసుకెళతారోనని
అప్పటినుంచి నాకు జలదరింపుగా ఉంది.

1 September 2017

## రక్తహేల

అక్షరాలతో
ప్రశ్నలతో
ధిక్కార స్వరంతో
సలసల మరిగే రక్తాన్ని
గాజుబుడ్డిలో సేకరించి
కోటగుమ్మానికి
వేలాడదీయటం
భలే బాగుంది... శభాష్
గొప్ప విజయోత్సవ దృశ్యం అది.. కదూ?

అనామక శవాలతో
చప్పగా ప్రవహించే చరిత్రకు
ఒక వర్ధంతిని బహూకరించటం
మామూలు విషయమా!
అభినందనలు.... అభినందనలు

ఒకటి గుర్తుంచుకో
ప్రశ్నలన్నింటినీ సంఘటితంచేసే వర్ధంతి మాత్రమే
చరిత్రలో మిగిలిపోతుంది ఎప్పటికైనా
నీ FIR కాదు.

8 September 2017
(గౌరీ లంకేష్ కొరకు)

## క్షతగాత్ర నది

జీవం కోల్పోయి
ఎండిన కన్నీటి చారికలా
మిగిలిపోయిన నది
యూనిట్లు యూనిట్లుగా
తరలించబడుతోంది
ఎడారి నగరాల నిర్మాణం కొరకు

మెలికలు తిరిగి, లుంగచుట్టుకొని
తరుచ్ఛాయల్ని తలచుకొంటూ
బుల్ డోజర్ కింద ఆదీవాసీ చేసిన
అరణ్యరోదనను గుర్తుచేసుకొంటూ
అపుడెపుడో మేసిన వెన్నెల్ని
చందమామ రజనుగా రోడ్డుపై కార్చుకొంటూ
క్షతగాత్ర నది
ట్రక్కులు ట్రక్కులుగా ప్రవహిస్తోంది
నగరం వైపు

24 March 2017

## Message in a train

సీటు వెతుక్కొని కూర్చున్నాను
ఎదురు బెర్త్ పై ఏదో పుస్తకం కనిపించింది
దాన్ని తీసుకొని చుట్టూ చూసాను
ఎవరూ కనిపించలేదు
ఎవరో మరచిపోయినట్లున్నారు
కవర్ పేజ్ పై
"ఈ శతాబ్దపు బెస్ట్ సెల్లర్" అన్న వాక్యం
ఆకర్షించింది

మొదటి పేజీపై అందమైన చేతివ్రాతలో
"డబ్బు ఎంత పేదదో అర్థమయ్యాకా ఈ ప్రపంచానికి
సాహిత్యం విలువ తెలిసొస్తుంది" అని వ్రాసి ఉంది.
ఆసక్తిగా వెంటవెంటనే పేజీలు తిప్పాను
అన్నీ తెల్లకాగితాలు .... అంతా ఖాళీ.... ఏమీ లేదు
ఆశ్చర్యం వేసింది

ఇంతలో చిన్న చిన్న పిల్లలు
బిల బిల మంటూ రైలెక్కారు
కూ అంటూ రైలు కదిలింది

12 November 2017

## నన్ను క్షమించవూ......

సంతలో నెమలీకలు అమ్ముతోన్న
ఒక వ్యక్తిని చూసాను

అలా అమ్మటం చట్టరీత్యా నేరమని
అతనితో చెప్పాలనుకొన్నాను

"చిరుగులు పడ్డ మాసిన దుస్తులు
కపాలానికి చర్మం తొడిగినట్లున్న మొఖం
తాడుకి వేలాడుతోన్న పగిలిన కళ్లజోడు
చెప్పులుకూడా లేని కాళ్లతో"
అతని రూపం చూసాకా
చెప్పబుద్ధి కాలేదు.

అవసరం లేకపోయినా
ఓ నాలుగు నెమలీకలు కొనుక్కొని
మౌనంగా వచ్చేసాను

నెమలీ నెమలీ
నన్ను క్షమిస్తావు కదూ!

27 November 2017

## A B C D లు

A ఫర్ ఆపిల్ కి
మైనం కోటింగ్ తో
ఊపిరాట్టం లేదు

B ఫర్ బాల్
ఒత్తిడి భరించలేక
లేని గ్రౌండ్ లో ఉరేసుకొంది

C ఫర్ కాట్
బాగ్ పైపర్ వాయించుకొంటూ
గుహ వైపు వెళుతోంది

D ఫర్ డాల్
వాణిజ్య ప్రకటనలకు
తైతెక్కలాడుతోంది

1 December 2017

## చీకటి దిష్టిబొమ్మ

జీవితకాలం శ్రమించి
చిత్రించుకొన్న చిత్తరువులో
కరిగి ప్రవహించే గడియారం
కనుల చివర నిలిచిన అశ్రుబిందువు
వేదనో నవ్వో తెలియని పెదవుల రహస్యలిపి
తుప్పుపట్టిన కిటికీ చువ్వలు

అయిందేదో అయిపోయింది
ఎండిన పూజాపత్రిని ఏట్లో కలిపినట్లు
నిన్ను బాధించిన క్షణాలను మరచిపో.

పట్టుబడిన ఎలుకలను ఊరవతల విడిచినట్లు
నిన్ను బాధించిన వ్యక్తులను మరచిపో.

మాయబుట్టని పొలిమేర చెట్టుకు కట్టినట్లు
నువ్వు బాధించిన సందర్భాలను మరచిపో.

గతాన్నొక గాలిపటం చేసి ఎగరేసి
దాని దారం తెంపేయ్

వెలుతురును అడ్డుకొంటున్న
చీకటి దిష్టిబొమ్మను దహనం చేసేయ్

కొబ్బరి పాకుడు లాంటి
మెత్తని గిట్టలతో లేగదూడ
మొదటిసారిగా ఎలా నిలబడుతోందో చూడు

పాదం బరువుకు ఒరిగిన పచ్చిక
మెల్లమెల్లగా
ఎలా నిటారుగా తలెత్తుకొంటుందో చూడు

31 December 2017

## ప్రయాణం.....

బస్సెక్కి నంబరు వెతుక్కొని
నా సీట్లో కూర్చొని చుట్టూ పరికించాను
బస్సు దాదాపు ఖాళీగా ఉంది

కార్నర్ కిటికీ సీట్లో ఒక స్త్రీ
ఫోన్ రింగవుతూంటే మ్యూట్ చేస్తోంది పదే పదే.
ఒక్కసారి ఎత్తింది.
కాసేపటికి ఓ నడి వయసు మనిషి వచ్చి
పక్కన కూర్చొని ఏదో మాట్లాడుతున్నాడు
ఆమె మౌనంగా ఉంది చాలాసేపు
"నన్ను ఓ పదిరోజులు ప్రశాంతంగా వదిలేయ్ ప్లీజ్"
అన్న ఆమె మాటలు మాత్రం స్పష్టంగా వినిపించాయి.
అతను వెళ్ళి పోయాడు

ఆమె కనులు మూసుకొని అద్దానికి తలాన్చి కూర్చొంది
కంటి చివర నుండి కన్నీటి చారిక మెరిసింది లిప్తపాటు.
బస్సు బయలు దేరింది

ఆమె గురించే ఆలోచిస్తూ నేనూ నిద్రలోకి జారుకొన్నాను

****

కండక్టర్ కేకతో హఠాత్తుగా మెలుకువ వచ్చింది.
తెల్లవారిపోయింది....... ఏదో స్టాప్ అనుకొంటాను.

ఆమె ఒక పిల్లాడ్ని ఎత్తుకొని
మరో పిల్లను నడిపించుకొంటూ
బస్సుదిగటం కనిపించింది.
ఆశ్చర్యం వేసింది
రాత్రి లేని పిల్లలు ఎక్కడనుంచి వచ్చారా అని!

ఎవరి స్వప్నాలలోంచి
ఎవరి స్వప్నాలలోకి
ప్రవహించారు వారు!

13 January 2018

## మోహం

ఆమె నీడ
నగ్నంగా మారి
నన్ను కౌగిలించుకొంది
బిరుతెక్కిన కుచాగ్రాలు
గుచ్చుకొన్నాయి

వృత్తిధర్మం ఎరిగిన
వేశ్యలా
నన్ను నేను విప్పుకొని
అర్పించుకొన్నాను

ఖాళీ గవ్వలోని ఇసకలా
కాఫిన్ బాక్స్ లోని దేహంలా
ఆమె నీడలో ఒదిగిపోయి
కొత్తలోకాలకు ప్రయాణం కట్టాను.

24 November 2017

## ముల్లు తీయించుకోవటం

ఒకని పాదాన్ని మరొకరు చేతుల్లోకి తీసుకొని
లోతుగా దిగి విరిగిన ముల్లుచుట్టూ
చర్మాన్ని ఉమ్ముతో శుభ్రం చేసి
పిన్నీసు మొనతో
మెల్లమెల్లగా ముల్లును పైకి లేపుతూ
బొటనవేలు చూపుడు వేలు గోర్లతో
పట్టుకొని బయటకు లాగి
అరచేతిలో ఉంచుకొని
విప్పారిన నేత్రాలకు చూపటం;
కాలుతున్న చుట్టను తీసుకొని
ముల్లు చేసిన గాయానికి సెగ పెట్టటం
ఎంత గొప్ప మానవీయ అనుభవం!
చిట్టిపాదాల్ని చిగుళ్లకు ఆనించి
మునిపంటితో ముల్లును తొలగించిన
అమ్మ జ్ఞాపకం లాంటి అనుభవం.

***

నేనెప్పుడైనా ఈ ప్రపంచంతో
రోజంతా వేసారి విసుగుచెంది అలసిపోయి
ఇంటికొచ్చినప్పుడు
నీ ప్రేమ ప్రవాహపు చేతులతో
నా ఆలోచనలకు కళ్లెం వేసి
నీ దేహ సౌగంధికా పరిమళంతో అల్లుకొని

నీ మెడ ఒంపులో అందంగా అమరిన
ఆకుపచ్చని రక్తనాళాలలోకి
నన్ను పొదువుకొంటావు ప్రతీసారీ

అపుడెందుకో నాకు
ముల్లు తీయించుకొన్న అనుభవమే
పదే పదే గుర్తుకు వస్తుంది.

5 April 2018

## ఒక....పురా.... ప్రకాశం....

ఒక 'సభానంతర సంభాషణ'లో
శివుని చుట్టూ చీమలు మూగాయి
చలి కాచుకొనేందుకు
చలిమంట జలపాతాన్ని ఆవిష్కరించిన
శివుడు తానే చలిమంటై
నృత్యం చేయనారంభించాడు.
పుల్లలని ఎగదోసే మిషతో
తానూ చలిమంటలో లయమైపోయాడు
మణుల శిఖుడు
చలిమంట వెలుగుల్ని తొడుక్కొన్న
'ఎడతెగని ప్రయాణం'
కవిత్వంలో సంగమించింది
***
కాళిదాసు, దండి, భవభూతి ఏనాడో
చంద్రుని చలిమంటగా కాచుకొనే ఉంటారు
ఏనుగు కుంభస్థలాన్ని చీల్చి దోచుకొన్న ముత్యాలలో
ఒకరినొకరు చూసుకొని మురిసిపోయే ఉంటారు.

లిప్తపాటు మెరిసిమాయమయ్యే దీపశిఖ వెలుగుల్లో
అనంతంగా ప్రకాశిస్తూనే ఉన్నారు
చలిమంటై....... నేటికీ.....

("గోదారి పలకరింపు" పుస్తకావిష్కరణ సందర్భంగా)
26 February 2018

## Brain in a Jar

నిన్న లేదు, రేపూ లేదు
ఈ క్షణం అంతకన్నా లేదు
నిద్రలేస్తే అదృశ్యమయ్యే స్వప్నం లాంటి
ఆలోచన మాత్రమే ఇదంతా
ఇంకా చెప్పాలంటే
ఆలోచన ఉందన్న స్పృహే
ఈ ప్రపంచం.

పూలు, కన్నీరు,
నాలికపై కరిగే చక్కెర గుళికా
నొప్పి తెప్పించే సిరెంజి సూది
ఈ మతం, ఈ కులం, ప్రజాస్వామ్యం
ప్రతీదీ ఒక ఆలోచన
మనిషిదో, శవానిదో, కాలానిదో!

నువ్వింతవరకూ చూడని
నా చిన్ననాటి నీలం చొక్కా నీకు లేనట్టే
నేనింతవరకూ చూడని
ఈఫిల్ టవర్ నాకూ లేనట్టే

డైనోసార్లని, పలాయనించే గజాన్ని, నీలం చొక్కాల్ని
కాలాతీతంగా ఒకే రంగస్థలంపై నాట్యం చేయించే

స్పృహ మాత్రమే అంతిమ సత్యం
మిగిలినదంతా ఒట్టి హంబగ్.

ఆలోచనల్ని స్రవించే
నువ్వూ నేనూ
గాజు సీసాలోని ఉత్త మెదళ్ళం.

25 October 2018

# Alone but Together....

The Two of Us Together and
Each of Us Alone - from a rental contract అనే Yehuda
వాక్యం వల్ల నిద్రపట్టక దొర్లుతుంటే
సడన్ గా ఫోన్ మోగింది
"మావయ్య పోయాడురా" అన్నాడు కుమార్ బావ
"ఎలాగా" అనబోయి అర్థరహితమనిపించి
"అలాగా, రేపు బయలుదేరి వస్తాను" అన్నాను

ఒక్కసారిగా
అమ్మ గుర్తుకొచ్చింది
"నీకిష్టమని మజ్జిగపులుసు చేసానురా తమ్ముడూ"
అంటూ కొసరి కొసరి వడ్డించేది మామయ్యకు

"ఉండు బస్టాండు దాకా వస్తాను" అంటూ చొక్కావేసుకొనే
నాన్న గుర్తొచ్చాడు

"వాడొట్టి వెర్రిబాగులోడు ఎలా బతుకుతాడో ఎంటో"
అంటూండే అమ్మమ్మ గుర్తుకొచ్చింది

"ఇంటికి పెద్దోడివి నువ్వే డీలా పడిపోతే ఎలా" అంటూ
నాన్న లేనప్పుడు ధైర్యం చెప్పిన అత్తయ్య గుర్తుకొచ్చింది

"మీ అత్తయ్య పోయినప్పటినుండీ
బతకాలనిపించటం లేదురా" అని వలవలా ఏడ్చిన
మామయ్య గుర్తుకొచ్చాడు

ఒక చావు వంద చావుల్ని బతికిస్తుంది

జీవించటం అంటే
ప్రేమించిన ఒక్కొక్కరినీ కోల్పోవటం కాదూ!

23 October, 2018

## బక్కచిక్కిన ప్రశ్న వొకటి....

మొదటి ప్రశ్నను నరుకుతోన్నపుడు
మనం పెద్దగా పట్టించుకోలేదు
పట్టించుకొన్నామేమో!
అది సరిపోలేదు
ఇపుడు
ప్రశ్నలన్నింటిమీదా
రంపం కోత చారలు

ప్రశ్నలన్నీ అంతరించాకా
పాంపే ప్లాస్టర్ ఆఫ్ పారిస్ దేహాల్లా
ఒకేరంగు దుస్తులు ధరించి
విజృంభిస్తోన్న కుంటి జవాబులు

ఫాక్టరీల్లో తయారుచేసి
హెలికాప్టర్లలో ఊర్లపై వెదజల్లే
అభిప్రాయాల్లాంటి జవాబులు
ఎక్కడ చూసినా

ఎర్రటి ఎండలో
బక్కచిక్కిన ప్రశ్నొకటి తన నీడలో తనే
కుక్కలా ముడుచుకు
పడుకొంది.....

పిల్లల చిన్నప్పటి ఆల్బమ్ ని
తడుముతో చూసుకొనే
వృద్ధ తల్లిలా
దాని చెంపకు నా చెంపను ఆనించి
దాని దుఃఖం వింటున్నాను

21 October 2018

## దుఃఖ ద్వారం

నగరం
కళ్ళు తెరచి నిద్రిస్తోంది
దాని రెండు కళ్ళు
రెండు దుఃఖ ద్వారాలు

పోయినేడు
వలస వెళ్ళిన కొంగలలో
ఒక్కటీ తిరిగిరాలేదు

వందలబానిసలు
తెడ్లు వేస్తోంటే
విలాసంగా కదులుతోంది కాలం

19 October, 2018

## సమాధానం

చెట్టుమీద ఉన్న
శవాన్ని భుజాన వేసుకొని
నడుస్తున్నాను
శవం తన కథ చెప్పటం మొదలెట్టింది

మొదట లోగొంతుకతో
క్రమక్రమంగా
భీకర అరుపులతో, ఊళలతో
గంటలు రోజులు సంవత్సరాలు
కథ సాగుతోంది అనంతంగా

ఎన్నో దృశ్యాలు కళ్ళముందు
లిప్తపాటు మెరిసి మాయమవుతున్నాయి

పాయింటు బ్లాంకులో పుస్తకాల్ని కాల్చటం
పాలిచ్చే జంతువుతో కేబరే డాన్స్ చేయించటం
నరమాంసభక్షణ చేస్తోన్న ఆటవిక మూకలు
పొడవాటి క్యూలో కుప్పకూలిన చమటనోటు
లాంటి దృశ్యాలు గగుర్పొడుస్తున్నాయి.. పదే పదే

బాటపైని రాళ్ళు, ముళ్ళు గుచ్చుకొని
బొబ్బలు తేరి, రక్తమోడుతున్నాయి పాదాలు

చివరగా
“సమాధానం చెప్పలేదో
నీ తల వేయి వ్రక్కలవుతుంది జాగ్రత” అంది శవం

సమాధానం చెప్పాను

శవం తల వేయి వ్రక్కలయింది!

12 September, 2018

## ఒక apocalypse అనంతరం.....

అడవి మధ్య పెద్ద మైదానంలో
ఒక గుంపు పోగుబడి ఉంది
పూసలు ధరించిన ఓ ముసలి వ్యక్తి
రాళ్ల మధ్య అటూ ఇటూ తిరిగి
గుండ్రంగా నునుపుగా ఉన్న చిన్న రాయిని ఎంపికచేసి
శుభ్రం చేసిన నేలపై ఉంచాడు.
చుట్టూ నాలుగు పుల్లలు పాతి
పుల్లలపై ఏదో అడవి చెట్టు ఆకులు పేర్చి
ఎదురుగా కూర్చొని ఆ రాయినే చూస్తూ
ఏదో మాట్లాడుతున్నాడు

అతని చుట్టూ అందరూ ఒక వలయాకారంగా కూర్చొని
కనులు మూసుకొని మౌనంగా ఉన్నారు

రకరకాల హావభావాలతో అతనా రాయితో
మెల్లగా మాట్లాడుతున్నాడు– మధ్యమధ్యలో నవ్వుతూ,
ఏడుస్తు, ఒక్కోసారి గంభీరంగా, కొన్ని సార్లు అభావంగా
చివరగా నేలను ముద్దాడి,
తన మనుషులకు నవ్వుతూ సైగ చేసాడు
అందరూ గంతులు వేస్తూ, డప్పులు మోగిస్తూ,
ఆనందించటం మొదలెట్టారు

అతని వద్దకు నెమ్మదిగా వెళ్ళి అడిగాను
ఆ రాయేమిటని
మా దేవుడు
ఏం చేసావు ఇంతసేపూ
మాట్లాడాను
ఏం మాట్లాడావు
పోయినేడు పంపించిన పెద్దలను చల్లగా చూసుకోమని
అడవి పూలు విరగకాయాలని
పిట్టలు, జంతువులూ సంతోషంగా జతకట్టాలని అడిగాను
ఇంకా
జీవులన్నీ పంచుకోగా పళ్ళూ దుంపలు మిగలాలనీ
వానలతో కప్పల నోళ్ళు నిండాలనీ
పుట్టబోయే బిడ్డలకొరకు వారి తల్లుల గర్భాలు గట్టిపడాలని

దేవుడు ఏమన్నాడు?
అలాగేనన్నాడు
మీ దేవుడి పేరేమిటి?
దేవుడు
పేరు
దేవుడికి పేరేమిటి? దేవుడి పేరు దేవుడే!
ఇదిగో జీలుగు రసం తాగు అంటూ
చిన్న తాటాకు దొప్ప చేతిలో ఉంచాడు.

6 August 2018

## గాయాల శ్వాస

CT స్కాన్ కవరును
చేతితో పట్టుకొని
ఆమె రోడ్డుపై భారంగా
అడుగులు వేస్తూ నడుస్తోంది.

సీతాకోకల తెగిన రెక్కల వానలో
వెన్నువిరిగిన అట్లాస్ లా ఆమె
స్వప్నించిన జీవితానికి
జీవిస్తోన్న స్వప్నానికి మధ్య
కన్నీటి పొరలు
నాపరాతి పొరలు
ఒక్కొక్క పొరను తవ్వుకొంటూ
ఒక్క ఆశకోసం ఒకే ఒక్క ఆశకోసం
ఆమె అన్వేషిస్తోంది

****

ఈ చేతుల్తో ఎన్నో గాయాల్ని
చిత్రించాను
ఈ గాయాన్నెందుకో
మరో కాలంలోకి
ఒంపలేకపోతున్నాను
గుండెలనిండా పురాగాయాల శ్వాస
నన్ను క్షమించు మిత్రమా!

30, June, 2018

## ఏం పని ఉంటుంది నీకూ ..

వెళ్తూ వెళ్తూ అతనన్నాడూ
"నే వచ్చేవరకూ
ఏం పని ఉంటుంది నీకు" అని

అతను వచ్చేసరికి
ధూళి, ఈగలు ముసిరిన నేల
బురదలో పొర్లాడిన పంది
అవతారం ఎత్తి
నట్టింట్లో తిష్టవేసి ఉంది.

నిన్నటి పూలు వాడి ఎండినా
రాల్చుకోకుండా
కొత్తమొగ్గల దుప్పటిని
కప్పుకోకుండా
మంచం మల్లెపొద
బద్దకంగా పడుకొని ఉంది

కిచెన్ సింక్ తటాకంపై
చచ్చిన చేపలు నాని ఉబ్బి
వికృతంగా తెట్టులా తేలి
అంతిమ పరిమళాన్ని
గానం చేస్తున్నాయి.

పాపాయి జారవిడిచిన
డైపరు విదిల్చిన శకలాలను
నదులు, పర్వతాలు మైదానాలు
అలంకరించుకొన్నాయి

బట్టలపెట్టి పొట్టపగిలి
లుకలుకలాడుతూ బెకబెకలాడుతూ
బయటపడ్డ జబ్బుచేసిన సీతాకోకలు

ఇల్లు మొత్తం
క్వారీపక్కన జుత్తు నెరిసి
కాంతి నశించిన చెట్టులా ఉంది.

అతను ఇంకెప్పుడూ అలా అనలేదు!

18 May, 2018

## నివేదన

లేత కొబ్బరాకుపై
ప్రతిబింబించే
వేన వేల స్వప్నాల
నిగారింపు

గోడపై గుచ్చిన
సీసాపెంకులకు
అంటుకున్న ఎండిన
రక్తపుమరకలు

కోట శిథిలాల మధ్య
ఏ జంతువుకో
చిక్కిన పావురపు
ఈకల కుప్ప

తల్లి రాకను గుర్తించిన
పక్షిపిల్లలా
తెరుచుకొన్న నోటితో
మూడడుగుల నేల

నీటిపై సన్నని పొడవైన
కాళ్ళతో
చక చకా నడిచిపోయే
సాలీడల్లే కాలం

25 April, 2018

## ఆట

ఆ పిలగాడికి
పెద్దజబ్బు చేసింది
చనిపోతాడనుకొన్నారు అందరూ

పదిరోజుల లంఖణాల తరువాత
చారు అన్నం తిని
అరుగుపై కూర్చొన్నాడు

వాడి స్నేహితులు
సైకిల్ తొక్కుకొంటూ
పరుగులెత్తుతో
కేకలు వేస్తూ
ఆడుకొంటున్నారు రోడ్డుపై

జీవించి ఉండటంలోని
సౌందర్యం
కొద్ది కొద్దిగా అర్ధమౌతోంది వాడికి

15 April, 2018

## అధికారం

అధికారంతో
నగరాలు, వంతెనలే కాదు
విశ్వాసాల సామ్రాజ్యాలు కూడా
నిర్మించగలరు కొంతమంది.

తమ జాతి గొప్పదని
తమ సంస్కృతి ఉత్తమమని
తమ అలవాట్లే పవిత్రమైనవనీ
ప్రచారం చేసి
మనుషుల్ని సమూహాలుగా, సంఖ్యలుగా
మార్చేస్తారు.

ఆలోచనల్ని పంజరాల్లో బంధించి
కాప్టివ్ బ్రీడింగ్ చేసుకొమ్మని వదిలేసి
వేడుక చూస్తారు.
తప్పించుకొన్న ఏ ఆలోచననైనా
రెక్కలు కత్తిరించి
నాలుగ్గోడల మధ్య వీల్‌చైర్ లో

కూర్చోపెడతారు.
ఓ నాయకుడు
రెండువేళ్ళూ పైకెత్తి గాల్లో
అటూ ఇటూ ఊపుతున్నాడు
ఎవరి విజయమో తెలియని
వెర్రిజనం కూడా ఊపుతున్నారు

# గీత

చికన్ షాపు పంజరంలోని
కోడిపుంజు మెడసారించి
కొక్కొరొక్కో' అంటూ కూస్తోంది
ఘడియను సూచిస్తూ
గమనించావా!

చివరి క్షణం వరకూ
చెయ్యాల్సిన పనుల్ని చేస్తూండటాన్ని
కాలం కూడా తప్పించుకోలేదు.

దిగులు చెందకు
కర్చీఫ్ ఇదిగో
కనులు తుడుచుకో ముందు!

22 November 2016

## ఇకపై...

తోడేళ్లకు
ఇష్టమైనదేదో
స్త్రీలో పెట్టానన్న పొరపాటుని
దేవుడు గుర్తించాడు
నాలుక కరచుకొని
సృష్టిని రీబూట్ చేసాడు

ఇకపై
మానవజాతి అరటి పిలకల్లా
పునరుత్పత్తి జరుపుకోనుంది

23 June, 2019

## అస్తిత్వం

అస్తిత్వం అనేది
గోనె సంచిలో తీసుకెళ్ళి ఊరి చివర విడిచినా
తోకూపుకొంటూ వచ్చి చేరే పిల్లి పిల్ల లాంటిది.
దాన్ని ప్రేమించటం నేర్చుకో
ఎన్ని కష్టాలు ఎదురైనా దాన్ని నిలుపుకో.

ఈ ప్రపంచం
నిన్నెలా చూడాలనుకొంటుంటుందో
అలా వేషం కట్టి
ఆత్మలోకంలో అమ్ముడుపోకు.
అబద్ధపు వేషం పదే పదే కట్టి
నువ్వే ఓ నిలువెత్తు అబద్ధంగా మారిపోకు

ఈ ప్రపంచం
ఏవి నీకు ఉండకూడదని ఆశిస్తుందో
అదే నీ అస్తిత్వం వాటిని కోల్పోకు
కర్ణుడు కవచకుండలాలని కోల్పోయినట్లు.

ఇంకొకరి అభిప్రాయంగా ఉండేకన్నా
నువ్వే ఓ సిద్ధాంతంలా మారు

26 April 2017

## సెల్ఫీ

కొత్తవిలువలతో
వ్యామోహాలతో
ఆక్రమింపబడిన కాలమిది
దేహాలలో పాల బదులు
ఇనుప గుప్పెళ్ళతో పూలను పిండి
వండిన అత్తరు ప్రవహిస్తోంది

అద్దాల గదిలో
అసంఖ్యాక ప్రతిబింబాల్లా
ఎవరు ఎవర్ని
అనుకరిస్తున్నారో తెలియని
పరాయీకరణ పరాకాష్ట ఇది.

జీవితం
అప్పుడప్పుడూ కాసేపాగి
తన సెల్ఫీ తానే తీసుకొంటోంది
ఒక్కో ఫొటో
రక్తమూ కన్నీళ్ళు నింపుకొన్న
కవిత్వమై చరిత్రలోకి ఇంకిపోతోంది.

5 December 2017

## పూలతోట

అమ్ముడు పోని పూలు
వాడి
ఎండిపోయాయనీ
ధరతక్కువ
ప్లాస్టిక్ పూలతో ఈ లోకం
నిండిపోయిందనీ
నిందిస్తూన్నంతకాలం
నువ్వు  ఇంకా పంజరంలోనే
ఉన్నావని అర్థం

కిటికీ అద్దాన్ని బొగ్గుపొడితో
శుభ్రం చేయి.
ఎండిన పూలు విత్తనాలై
మొలకలెత్తి పూల తోటల్ని సృష్టిస్తోన్న
దృశ్యం కనిపిస్తుంది
ప్లాస్టిక్ పూలపై
ఏ తుమ్మెదా వాలటం లేదనే
సత్యం గోచరిస్తుంది.

నీలోపలకు తొంగిచూసుకో
పరిమళమేదో
సన్నగా వీచటం తెలుస్తుంది.

దాన్ని అనుసరించు
నీ పంజరాన్ని తెరిచే
తాళంచెవి ఉన్న చెట్టుతొర్ర వద్దకు
నిన్ను తీసుకెల్తుంది

నువ్వొక రెక్కల
కుసుమానివన్న స్పృహ
ఒక్కసారిగా కలుగుతుంది నీకు
పంజరం వీడి
ఎగరటం మొదలెడతావు

జీవితపర్యంతమూ
పరిమళించీ పరిమళించీ
పూదోటగా విస్తరించటానికే
నువ్వు ఇక్కడకు వచ్చావు

3 January 2017

## మా నాన్నా – నేనూ

మా అక్కని ఒంటరిగా ఎప్పుడూ
బయటకు పంపేవాడు కాదు మా నాన్న
ఇప్పుడు నేనూ అంతే
మా అమ్మాయి బయటకు వెళతానంటే
తమ్ముణ్ణి తోడుగా తీసుకెళ్లమంటున్నాను.

కరువు కాలంలో పావలా తగ్గుతుందని
మూడు కిలోమీటర్లు సైకిలు తొక్కుకొని
పెద్దమార్కెట్లో సంత చేసేవాడు మా నాన్న
ఇపుడు నేనూ అంతే
ఏడాదికోసారి ఉల్లిపాయల క్యూలో
గంటలతరబడి నిలుచుంటున్నాను

సమాజం పట్ల ఆవేశం కలిగినపుడు
హిందూ పత్రికకు ఓ ఉత్తరం వ్రాసి పారేసి
ప్రపంచం మారిపోతుంది అని కలలు కనేవాడు
ఇప్పుడు నేనూ అంతే
ఆవేశాన్ని అక్షరాలలోకి ఒంపుకొంటాను
ఇంకేం చేయాలో తెలియక.

పాతబస్తీ అల్లర్లని రేడియోలో విన్నప్పుడు
పార్టిషన్ నాటి ఘర్షణల రక్తగాయాల్ని
కథలు కథలుగా వినిపించేవాడు మా నాన్న.

ఇప్పుడు నేనూ అంతే
టివిలో మారణహోమాల్ని చూసినపుడు
క్రుసేడ్లనుంచి సద్దాం వరకూ చరిత్రను ఏకరువుపెట్టి
బటర్ఫ్లై సిద్ధాంతాన్ని ఎగరేస్తాను నిస్సిగ్గుగా

మా ఇద్దరి జీవితాల మధ్యా
నాలుగు దశాబ్దాల దూరం పరుచుకొని ఉంది

మేమిద్దరం రకరకాల పాలకుల్ని మార్చాం కూడా

24 January 2017

## ఎలా బయటపడగలవ్?

వేల నాల్కలతో మింగే
దాహానికి
శలభంలా మాడిమసి కాక ముందు
నువ్వు దానితో చేసుకొన్న
రాజీ ఒప్పందాన్ని ఎక్కడా చెప్పకు
ఆత్మను చంపుకొంటావో
హృదయాన్ని అమ్ముకొంటావో
నీ యిష్టం

గొర్రెల మధ్య గొర్రెలా
నక్కల మధ్య నక్కలా బతకటం
చాలా సులువు
మనిషిలా
బతకాలనుకోవటం కన్నా

17 February 2019

# మహా నగరం

ఓ మహా వృక్షాన్ని కొట్టేసారు
ఒక పిట్ట తన చివరి పాటను
అక్కడే విడిచి
ఎక్కడికో ఎగిరిపోయింది
లేని చెట్టుకొమ్మకు వేలాడుతోన్న
ఆ పిట్ట పాట గాలికి ఊగుతోంది

ఆ పాట వినీ వినీ
నగరానికి పిచ్చెక్కింది

దుస్తులు చింపుకొని నగ్నమై
నేలపై పొర్లాడుతోంది
తన బాహువుల్ని తాడెత్తు గోడల్లా
పిచ్చిగా విస్తరింపచేసి
సరిహద్దుల్ని బంధించింది.

బయటకు వెళ్ళే మార్గం
ఎవరికీ తెలియదు
దాని గురించి
ఎవరూ మాట్లాడుకోరు కూడా!

11 March 2019

## సోషల్ ఇంజనీరింగ్

మన జీవితాల్ని ఎక్సెల్ షీట్ లో
గదులు గదులుగా నింపి
బోర్డు మీటింగుల్లో
పవర్ పాయింట్ ప్రెజెంటేషన్స్ ద్వారా
మన తరపున నిర్ణయాలు తీసుకొంటారు
ఏం కొనాలో
ఏం తినాలో
ఎలా బతకాలో అన్ని నిర్ణయాలూ.

ఆ ప్రకారం జీవించాల్సిందే! వేరే దారి లేదు.
వ్యతిరేకించటానికి చేసే ధర్నా కూడా
నిర్దేశిత ప్రదేశాలలో అనుమతి తీసుకొని చేయాలి.
ఏదో కంపనీ సబ్బు కొని నీకు కరుణ ఉందని
ఏదో దేశ ప్రజలను ద్వేషించి నీకు దేశభక్తి ఉందని
నిరూపించుకోవలసి ఉంటుంది.

ఇప్పుడు ప్రపంచం
చక్కగా నియంత్రించబడుతోన్న ఒక యంత్రాంగం
చివరకు
నిన్నరాత్రి నువ్వు కన్న స్వప్నంతో సహా!

14 March 2019

## గులకరాయి

వాచీలో అపుడు సమయం మారేడుమిల్లి
సెలయేటి ఒడ్డున కూర్చొని
నీటి రాపిడికి గుండ్రంగా నున్నగా మారిన
ఒక గులకరాయిని చేతిలోకి తీసుకొని
చెవి వద్ద ఉంచుకొన్నాను.

కొండలపై భోరున కురిసే వాన శబ్దాలు,
ఉరుములు, భీకరంగా వీచే గాలుల ఊళలు,
చీకట్లో చినుకుల దారిలో
"a girl in red coat" ఒంటరిగా
నడిచిపోతోన్న అడుగుల సవ్వడులు వినిపించాయి.
ఏవో జ్ఞాపకాలు బహుశా!

ఆ గులకరాయిని ఆశ్చర్యంతో చూస్తుండగానే
కళ్లముందే ఓ సీతాకోక చిలుకలా మారి
తన ఒంటరితనాన్ని నా చేతిలో ఒదిలిపెట్టి.
ఎటో వెళ్ళిపోయింది
దాన్ని జేబులో వేసుకొని ఇంటికి బయల్దేరాను.

***

ఒంటరితనం
ఎర్రని గౌను తొడుక్కొని

నా రీడింగ్ టేబుల్ పై కూర్చొని
చీకట్లో మెరిసే కళ్లతో
నన్నే తదేకంగా చూస్తోంది.
వాచీలో అపుడు సమయం అడవి.

("a girl in red coat"- "Schindler's list" సినిమాలో ఒక ప్రతీకాత్మక పాత్ర)

5 April 2019

## స్త్రీ

ఎంతకాలం
తన స్వప్నాల్ని
బతికించుకోగలడు
పాపం ఆ కుర్రాడు!

నేత్రాల్ని అమ్ముకొని అంధత్వాన్ని
హృదయాన్ని అమ్ముకొని అల్పత్వాన్ని
కొనుక్కోక తప్పదు ఏనాటికైనా

"నువ్వు ఇదివరకట్లా లేవు
చాలా మారిపోయావు" అంటుందామె ఓ రోజు
కాళ్ల క్రింద నేల కూలినట్లనిపిస్తుంది అతనికి

ఆమె ఒళ్ళో చేరి
వల వలా ఏడ్చేస్తాడు.
ఆమె
తన స్తన్యాన్ని అతని
నోటికి అందించి
ఓదారుస్తుంది.

27 April 2019

# Personal

నువ్వు మతవాదివా?
అవును మతవాదినే!

మతం అంటే భగవంతునితో
నేచేసే ఏకాంత సంభాషణ
చిడతలు పట్టుకొన్న సమూహాలలోను
త్రిశూలాలు తిప్పుతున్న బ ృందాలలోను
నేను లేను..... జై శ్రీరామ్

నువ్వు కమ్యూనిస్టువా?
అవును కమ్యూనిస్టునే!

కమ్యూనిజం అంటే సమాజం పట్ల
నాకున్న వ్యక్తిగత బాధ్యత
జండాలు పట్టుకొన్న సమూహాలలోను
తుపాకులు మోస్తున్న బృందాలలోను
నేను లేను..... లాల్ సలామ్.

27 May 2019

## చిట్టి కురువి

ఓ చిన్నారి పిట్ట
నిలువ నీడలేక, దాహం తాళలేక
నేల కూలింది

మానవుడు ఇంతవరకూ తయారుచేసిన
గొడ్డళ్ళన్నీ
చనిపోతున్న ఆ పిట్ట చుట్టూ చేరి
దీనంగా చూస్తున్నాయి
రంపాలన్నీ
చనిపోతున్న ఆ పిట్టకొరకు
కన్నీరు కారుస్తున్నాయి
బుల్ డోజర్లన్నీ
చనిపోతున్న పిట్టను బ్రతికించమని
తొండాలెత్తి ప్రార్థిస్తున్నాయి

మనిషి జాడ లేదు

ఒక చిన్న పాప మెల్లగా నడచుకొంటూ వచ్చి
"చిట్టి కురివీ! నిన్నెవరు కొట్టారమ్మా" అంటూ
ఆ పిట్టను చేతిలోకి తీసుకొంది.
వేళ్ళ కొనలలోంచి జలపాతాల్ని పుట్టించింది.

దాహం తీర్చుకొన్న పిట్ట
రెక్కలు తప తప లాడిస్తో
పాప చుట్టూ కాసేపు తిరిగి
ఎటో ఎగిరిపోయింది.

(రోజూ పక్షుల కొరకు నీళ్ళూ, గింజలు ఉంచుతున్న చిన్నారి మేఘన కొరకు)

28 May 2019

## తదుపరి ఎత్తు?

పార్కులో ఒక మూల
సిమెంటు బెంచీపై ఒక వృద్ధుడు కూచొని
రెండువైపులా ఎత్తులు తానే వేసుకొంటూ
చెస్ ఆడుతున్నాడు.

తెల్లరాజు, నల్ల రాణి ఎవరూ చూడకుండా
ముద్దులు పెట్టుకొని
ముసిముసి నవ్వులు నవ్వుకొంటున్నారు.

పల్లీల బుట్ట పట్టుకొన్న భటుడు
ఒక్కొక్కరి వద్దా కాసేపాగి ముందుకు
సాగుతున్నాడు.

బరువు తగ్గాలని ఏనుగు
గాల్లో చేతులు ఊపుకొంటూ
బోర్డంతా అటూ ఇటూ వాకింగ్ చేస్తోంది.

అమెరికన్ స్వీట్ కాన్ బండి గంట
పదే పదే మోగిస్తున్నాడు మరో బంటు

చెట్టుకింద కూర్చొన్న శకటం తాత
కమ్యూనిస్ట్ మానిఫెస్టో గురించిన కథలేవో
చెపుతున్నాడు చుట్టూ చేరిన కుర్ర భటులకు.

పెదాలపై రెండువేళ్ళు ఉంచుకొని
దీర్ఘంగా ఆలోచిస్తున్నాడా వృద్ధ ఆటగాడు

పిల్ల బంట్లు జారుడు బల్లపై
కేరింతలు కేరింతలుగా జారుతున్నారు

హాండ్ బాగ్ లోని కండోమ్ పాకెట్ ను
బయటకు తీసి రెండు వేళ్ళ మధ్యా తిప్పుతూ
ఎవరికో చూపిస్తోంది ఒక ఆడ బంటు

గుర్రం పరిగెత్తీ పరిగెత్తీ
పడమట లోయలో కరిగిపోయింది
మసక చీకటి మెల్లమెల్లగా
నాగమల్లి పూల పరిమళంతో కలిసి వీస్తోంది.

వృద్ధ ఆటగాడు ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాడు.
తదుపరి ఎత్తుకోసం.

11 June, 2019

## కోరంగి మాంగ్రోవ్స్....

ప్రతిరోజూ ఎంతో మంది వచ్చిపోతూంటారు
పిల్లలతో, ప్రియురాళ్లతో
ఒంటరిగా, సమూహాలుగా.....

చెక్కల వంతెనదారికి ఇరువైపులా పరచుకొన్న
సౌందర్యాన్ని ఆస్వాదించటానికి,
గుంపులు గుంపులుగా నిద్రిస్తోన్న నత్తలని
నిబిడాశ్చర్యంతో చూడటానికి,
చిక్కని ఆకులతో మడచెట్లు పట్టే గొడుగు నీడల
స్నానం చేయటానికి,
రాత్రిపూట ఏదో జంతువు వదిలిన పాదముద్రల్ని
డీకోడ్ చేసేందుకు,
అసౌందర్యాన్ని రాల్చి ఎటో ఎగిరిపోయిన తెల్లకొంగను
దృశ్యంగా బంధించటానికి
ప్రతిరోజూ ఎంతో మంది వచ్చిపోతూంటారు

వచ్చిన వాళ్ళే మరలా మరలా వస్తూంటారు

ఈ వనానికి ఎప్పుడో గుప్పెడు క్షణాలు రుణపడ్డట్లు,
ఈ బురదనేలలో పోగొట్టుకొన్న ఏ స్వప్నాల్ని వెతుక్కోవటానికో
గాలిపీల్చుకోవటానికి భూమిపైకి వచ్చిన వేళ్ళలా
ఉరుకుల ఆయాసం తీరటానికి ఏ లోలోపలి ఊపిరికోసమో

వచ్చిన వాళ్ళని
పొన్నచెట్టు నీడలు, గుగ్గిలపు ఆకుల గలగలలూ
నవ్వుతూ పలకరిస్తాయి.

అభయారణ్యం మధ్యలో ఉన్న
క్షీణమైన పురాతన లైట్ హౌసు, దాని వలయాకార మెట్లు
ఏ కొద్దిమంది సాహసులనో ఆకర్షిస్తాయి
ఉత్సాహంగా ఉరకలు వేస్తూ, కేరింతలు కొడుతో
దానిపైకి ఎక్కి ఫొటోలు తీసుకొంటారు

వారిలో ఏ ఒకడో
దూరంగా కనిపించే సువిశాల సముద్రాన్నీ
లంగరు వేసిన ఓడల్నీ, నగర హర్మ్యాల్ని
ఇంకా సుదూరంగా కనిపించే ఫాక్టరీ గొట్టాల్ని
శిథిలమైపోయిన ఒకనాటి కోరంగి మహానగరాన్ని
తదేకంగా చూసి
మౌన భారంతో మెట్లు దిగుతాడు

నదీపాయల నడుమ నారాయణ పక్షుల బారుని
డీజిల్ శబ్దం
చెల్లాచెదురు చేస్తుంది.

18 August , 2019

## అంధుని ఇంద్రధనుసు ....

దాహానికి పనికిరాని
ఉప్పునీరు
పరవళ్ళు తొక్కుతూ
ప్రవహిస్తుంది

నువు మాట్లాడని మాటలన్నీ కూడా
నీ అస్తిత్వమే అన్న స్పృహ
నిన్ను దారికాసి అడ్డగిస్తుంది
జ్ఞాపకాలతో అనంతమైన పెనుగులాట

LED కాంతుల సందోహంలో
ఎపుడు తెలవారిందో
గమనింపే ఉండదు
పిట్టలన్నీ దారితప్పి
సముద్రంలో  కూలిపోతాయి.

హతుని పిడికిలిలోని వెంట్రుకలు
ఏ DNA పరీక్షలకూ అందవు.

గతమంతా
అంధుని ఇంద్రధనుసు వర్ణనలా
అనిపిస్తుంది చివరకు.

అంతా అయిపోయిందని
కాడి పారేస్తాం.
అపుడు   గమనించం కానీ
నేలపగుళ్ళలో దాక్కున గింజో
ఎదురొచ్చి కాళ్ళకు చుట్టుకొనే
పసిపాప నవ్వో
ఏదో మిగిలే ఉంటుంది.

కర్రను చెక్కపై తిప్పగా తిప్పగా
నిప్పు పుట్టినట్లు
ఒక్కసారిగా లోలోపల ఏదో కొత్తకాంతి
విచ్చుకొంటుంది.

కొండలమధ్య ఎక్కడో ఓ ఖగరాజం
నోటికి అడ్డంగా పెరిగిన ముక్కును
రాళ్ళకేసి బాదుకొని బాదుకొని
పునర్జన్మ పొందుతుంది.

20 August, 2019

## వలస పోవటం....

“ఉండరా ఎదురు వస్తాను” అంది అమ్మ
“అవన్నీ మూఢనమ్మకాలమ్మా, నీ పిచ్చికానీ” అన్నాను
అమ్మ నవ్వుతూ ఎదురుగా వస్తూంటే
బేగ్ భుజాన వేసుకొని బయలుదేరాను
“జాగ్రత్తరా! ఉత్తరం రాయి” వెనుకనుంచి నాన్న

ముప్ఫై ఏళ్ళు గడిచిపోయాయి

అదంతా మళ్ళీ జీవించాల్సి వస్తే బహుసా
ఇలాంటి దారుల్లోనే సాగాల్సి వచ్చేదేమో!

కానీ ఖచ్చితంగా
“ఇది నీకు గొప్ప అవకాశమోయ్” అన్నప్పుడు
బాల్యం నుంచి తెచ్చుకొన్న నీలగోరింట మొక్కను
ఎడార్లకు అమ్ముకోకపోదును.

ఒక రాత్రివేళ గులాబి చేతుల్ని
విడిపించుకొని వచ్చేసేవాణ్ణికాదు.

మెట్లు ఎక్కుతున్న కొద్దీ నేలకు దూరమౌతున్నాననే
ఎరుకను మొదట్లోనే గ్రహించేవాడిని.

చీకటి జిప్పుతీసి ఒంటరితనాన్ని పదే పదే
చూపించే కిటికీని ధ్వంసం చేసి ఉండేవాడిని.

రెండుగా చీలిన దారిలో మరలా కుడివైపుకే
బహుశ కొంచెం ముందుగానే మళ్ళేవాడినేమో!

***

"ఉండరా ఎదురొస్తాను" అంటోంది నా భార్య
"అవన్నీ blind faiths అమ్మా" అంటున్నాడు కానీ
నా కొడుక్కూ అది ఇష్టమేనని నాకు తెలుసు.
ఆమె నవ్వుతూ ఎదురొస్తుంటే
ఓలాకాబ్ మెల్లగా ముందుకు కదిలింది
"ఫోన్ చేస్తూండు" అన్నాను కానీ
మాటలు గొంతుదాటాయో లేదో నాకే తెలీలేదు

చెంపలపై ఏదో జారినట్లనిపించింది
చేతికి వెచ్చగా కన్నీరు తగిలింది.

ముప్పై ఏళ్ల క్రితం ఇల్లు విడిచినపుడు
మా నాన్న కళ్ళలో కళ్ళు పెట్టి చూడలేకపోయాను!
ఇందుకేనేమో!

29 August, 2019

## ప్రేమ...

చాన్నాళ్ళ తరువాత
చిన్ననాటి స్నేహితురాల్ని
కలిసాను
ఒకనాటి విఫల ప్రేమికురాలు
ఆమె.

ప్రేమించిన వాడి
పేరును
చేతిపై పచ్చబొట్టు
వేయించుకోవటాన్ని
వింతగా చెప్పుకొనేవాళ్ళం
అప్పట్లో!

హృదయంపై ఉండే
బార్ కోడ్ గీతలు ఒక్కొక్కటీ
కులానికి
మతానికి
అంతస్తుకి
ప్రతీకలని ఇప్పటికైనా
గ్రహించిందో లేదో!

22 November 2016

## ఉదయకాంతి

సీసాకు ఉన్న అన్ని ఒంపులను
దుస్తులుగా ధరించే ద్రవంలా
హృదయం
ఈ లోకపు అన్ని వంకరలకు సర్దుకుపోగలిగితే
ఇక సాహిత్యం అవసరం ఏముంటుంది?

సర్దుకుపోవటం అంటే
చచ్చిపోకుండా ఉండటం అంతే!
చరిత్రలో
మనిషేనాడూ సర్దుకుపోలేదు.

సౌందర్యం తనను వర్ణించమంటుంది
కన్నీళ్ళు తమగురించి చెప్పమంటాయి
గాయాలు తమగురించి రాయమంటాయి
సంకెళ్ళు తమగురించి మాట్లాడమంటాయి

***

సరైన పదం కోసం
చీకట్లో తడుముకొంటూంటే
చేతికి సూర్యుని ముక్క తగిలింది

కన్నీళ్ళు తుడిచే
గాయాలని తడిమే

సంకెళ్ళని తెంచే
ఉదయకాంతి పద్యమై
విచ్చుకొంది

ఎప్పటికైనా
పద్యమే ఉదయకాంతి

5 January, 2018

## గురుదేవులకు వందనాలు

కొన్ని జ్ఞాపకాలు
అలా నిలిచిపోతాయి మదిలోతుల్లో
మధుర గీతాల్లా, సుందర చిత్రాల్లా.

తనువు ఎక్కడెక్కడ సంచరించినా
ఏవో కొన్ని ఆత్మ శకలాలు ఈ స్కూలు ఆవరణలో
నేటికీ తిరుగాడుతూనే ఉంటాయి నీకైనా నాకైనా.

స్కూలు అంటేనే గురువులు
గురువులు అంటే నిన్నూ నన్నూ
గురిచూసి సంధించిన విలుకాళ్ళు.

****

మహేంద్రుడు స్వర్గలోకాధిపతి అని వినటమే! కానీ
మా మహేంద్రవాడ మాష్టారు అధిపతిగా ఉండి ఈ స్కూలును
అమృతతుల్యం చేసారు మా స్మృతులలో ఈనాటికీ.

కామేశ్వరరావు మాష్టారి చేతివేళ్ళనుండి మన జబ్బగుండా
హృదయంలోకి ప్రవహించిన క్రమశిక్షణ
అప్పుడు నెప్పనిపించినా ఇప్పుడు మెప్పుల్ని ఇస్తోంది.

దంగేటి మాష్టారు NCC దుస్తుల్లో తిరుగుతోంటే
ఆ నాలుగో సింహమేదో సంచరిస్తున్నట్లుండేది.

సలాది మాష్టారు నా జోలెలోకి విదిల్చిన ఆ కాసిన్ని అక్షరాలే
నేడు ఈ కలం నుండి  జాలువారుతున్నాయి.

మేరుపర్వతం వంటి పేరి మాష్టారి భాషాగరిమ
విద్వత్ గాంభీర్యం అపుడు ఇపుడూ ఒక ఆశ్చర్యమే!

పెద్ద హిందీ మాష్టారి క్లాసులు రసవంతంగా
చిన్న హిందీ మాష్టారి క్లాసులు భాషావంతంగా ఉండేవి

ఉంగరాల మాష్టారు ఆనాడు క్లాసులో  చెప్పిన బంగారు సూక్తులే
నేడు వ్యక్తిత్వవికాస పాఠాలుగా మార్కెట్ చేయబడుతున్నాయి.

చక్రవర్తుల మాష్టారు, ఆచార్యుల మాష్టారు గణితరాజ్య చక్రవర్తులై
మాకెవ్వరికీ గుండెగాభరా రాకుండా పరిపాలించేవారు.

రమణమాష్టారు చెప్పే జానపద కథలు ఊహాశాలితను పెంచేవి
కొప్పుల మాష్టారి విజిలు, లింగమూర్తి మాష్టారి వ్యక్తిత్వం
మాకు  క్రీడలతో పాటూ జీవితాన్ని కూడా నేర్పాయి.

హబిబుల్లా మాష్టారు  ఈ సువిశాల ప్రపంచాన్ని
ప్రాపంచిక తత్వాన్ని మా చిన్ని బుర్రల్లో దట్టించి వదిలారు.

జయశ్రీ మాష్టారు వాత్సల్యంతో, ఖాదర్ మాష్టారు ఉదారంగా,
మొండి మాష్టారు మంచిగా
మా హృదయాలలో శాస్త్రీయ బీజాలు నాటారు.

చెల్లి కృష్ణమూర్తి మాష్టారు  క్లాసులో అంబేద్కర్ జీవిత ఘట్టాల్ని
రసార్ద్రభరితంగా ఆవిష్కరించిన వైనం నేటికీ సజీవమే ఈ
గుండెల్లో.

****

కొన్ని జ్ఞాపకాలు
అలా నిలిచిపోతాయి మదిలోతుల్లో
మధుర గీతాల్లా, సుందర చిత్రాల్లా.

ఈ జీవితానికి సరిపడా జ్ఞానాన్ని, అనుభవ సారాన్ని ఇచ్చిన
గురుదేవులందరికీ వందనం..........పాదాభివందనం.

29-12-2016

(యానాంలో నేను చదివిన మహాత్మాగాంధి బాలుర హైస్కూలు 60 వసంతాలు
పూర్తిచేసుకొన్న సందర్భంగా వెలువరించిన సావనీర్ కొరకు వ్రాసినది)

## పాఠం

ప్యూపా నుంచి అందమైన
సీతాకోక చిలుక రావటాన్ని
నిబిడాశ్చర్యంతో
గమనించాడా పిలగాడు.

అది రెక్కలల్లార్చుకొంటూ
ఎగురుతోంటే చప్పట్లు కొడుతూ
ఆనందించాడు.

కొన్నాళ్ళకు
చచ్చిపోయిన ఓ సీతాకోకను
బ్రతికించటానికి ఎన్నో ప్రార్థనలు చేసి
ఫలించక ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు.

జీవితం ముందుకేతప్ప వెనక్కు
ప్రవహించదన్న సంగతి
ఏ స్వప్నమో నేర్పుతుందిలే!

20-09-2019

## పట్నం కన్నీరు....

రాత్రి వేసిన
సిమెంటు రోడ్డుపై
ఏ పశువో నడిచిందేమో!

జంట చంద్రవంకల్లా
కాలి గిట్టల గుంటలు.

వాన నీరు చేరి నీలంగా ఉన్నాయి

గోరటి వెంకన్న గుర్తొచ్చాడు

చుట్టూ చూసాను
ఒక్క పిట్టా కనిపించలేదు.

2-10-2019

## Skin Trade

‘పట్టువంటి  మృదువైన చర్మం
నీ వయసుని తెలియనివ్వదు’ అంటూ
మిరిమిట్లుకొలిపే కాంతుల మధ్య
ఒకరు ప్రశంసింపబడుతూంటారు.
తనలాగే రక్తమాంసాలతో తిరిగే
మరొక వ్యక్తి చర్మాన్ని సజీవంగా ఒలిచి
అతికించుకొన్న ప్లాస్టిక్ సౌందర్యమది.

ఆ చర్మకాంతి వెనుక
ఒట్టిపోయిన సెక్స్ వర్కరో
పట్టుబడిన అభాగ్యురాలో
ఆమె ఎవరైతేనేం!
బతికుండగానే చర్మం
ఒలచబడుతుంది చీకట్లో.
దేహంపై పేదరికం
చేసిన మచ్చను జీవితాంతం
మోసుకుతిరుగుతుందామె.

విషాదమేమిటంటే అక్కడ కూడా
తెల్లతోలుకు విలువెక్కువ.

9 April, 2018

(సౌందర్య సర్జరీలకై నిరుపేదల చర్మాన్ని వలిచి  సరఫరాచేసే స్కిన్ ట్రేడ్ గురించి)

## ఎవరు వీళ్లంతా?

ఏసుబాబు
వీరాస్వామి
లక్ష్మణరావు
పెంటయ్య
ఇంకా కొంతమందీ.... ఎవరు వీళ్ళంతా!
ఓ ముప్పై నిముషాల వ్యవధిలో
ధరాధిపతులు, నరహంతకులూ అనాదిగా
చేసిన కృత్యాలన్నీ అకృత్యాలేనని
ఒక్క తులసిదళంతో తేల్చిపారేసారు.

అంత చేసీ
ఒడ్డుకు లాక్కొచ్చిన ఇరవైఏడుమందిలో
ముగ్గురి ప్రాణాలు కాపాడలేకపోయామని
బాధపడుతున్నారు చూడు!

ఓ నా చిట్టి మేధావీ!

ఆ కొద్దిక్షణాలూ
బొట్టు, టోపీ, శిలువా, రోలెక్స్ వాచీ
ఏ తారతమ్యం లేదక్కడ
ఆ కొద్దిక్షణాలూ
మనం నిర్మించుకొన్న
గోడలన్నీ కుప్పకూలిపోయాయి

ఓ నా చిట్టి మేధావీ!
మరోసారి చెపుతున్నాను విను.

మానవత్వం ఒకటే
మునిగిపోతున్న ప్రాణానికి ప్రాణం పోసింది
మనిషితనం ఒకటే
మనిషిని మనిషితో బంధించింది.
మనిషి గమ్యం మనిషితనమే ఏనాటికైనా!

ఐస్ ఏజ్ నుంచి డిజిటల్ ఏజ్ దాకా
మానవజాతి నౌకాయానానికి
ఏ చరిత్రా గుర్తించని
కనిపించని తెడ్లు వీళ్ళు.
మనుషులుగా మనం పూర్తి వైఫల్యం
చెందలేదనటానికి మిగిలున్న
ఒకే ఒక సాక్ష్యం వీళ్ళు.

19 September, 2019
(ఇటీవలి గోదావరి బోట్ ప్రమాదంలో అనేక ప్రాణాలు కాపాడిన స్థానికజాలరుల కొరకు)

## ఫ్రాగ్మెంట్స్

1.
కాలంలా ఒకసారి
మొఖం చూపించి పారిపోదు కాంతి
ఇక్కడిక్కడే తారాడుతుంది
పువ్వుల్లోనో, నవ్వుల్లోనో

2.
ఆకాశం
తన పెదాలకు
ఏడురంగుల లిప్ స్టిక్
కొట్టుకొంది

3.
ఒంపులన్నీ
సరిగ్గా ఉన్నాయో లేదొ
ఆఖరుసారి అద్దంలో చూసుకొని
బయటకు అడుగుపెట్టింది
నెలవంక

4.
స్థిరత్వం లేదన్నావు కదూ!
కిటికీలోంచి వచ్చిన
సూర్యకాంతే
ఊసలు ఊసలుగా
ముక్కలయింది
ఇక నేనెంత?

6.
ఏదో చేప వలలో చిక్కింది
భారంగా ఒడ్డుకీడ్చుకొచ్చారు.
అదృశ్య కన్నీళ్ళకు
సంద్రం అనాదిగా ఉప్పుతేరుతూనే ఉంది.

7.
విద్య మద్యం
ఇక్కడ MRP ధరలకే
అమ్మబడును.
ఉరేసుకోవటానికి "పెర్మిట్ రూమ్"
సదుపాయం కూడా కలదు

8.
అభిమాన నటుడి ఫ్లెక్సీలు
హోరెత్తించే స్పీకర్లు
తూలిపోతూ స్టెప్పులు వేస్తున్న
టీనేజ్ పిల్లలు
దుఃఖం పొంగుకొస్తోంది.

3 November 2017

## ఫ్రాగ్మెంట్స్

1.
రాత్రి ఫోన్ చేసాను ఎత్తలేదేం?
24/7 సిగ్నల్స్ రిసీవ్ చేసుకోటానికి
నేను సెల్ టవర్ ని కాదు మనిషిని
అందామనుకొన్నాడా చిరుద్యోగి
"సారీ బాస్" అన్నాడు

2.
అక్కడో కోపోద్రిక్త సమూహం
రాజుగారి దిష్టిబొమ్మను తగలేస్తూంది.
అనాదిగా నరహంతక రాజ్యానికి
బలయిన అసంఖ్యాక ఆత్మలు
పడీ పడీ నవ్వుకొంటున్నాయి.

3.
సూర్యకిరణాల కిలకిలారావాలతో
మొదలవ్వాల్సిన కొన్ని ఉదయాలు
తుపాకీ మోతలతో మొదలవటం
ఎంత విషాదం!
'వివేకుడా' నీకు నా ముద్దులు.

4.
అందమైన సీతాకోకలు
గాల్లో తేలిగ్గా అలా ఎగిరే దృశ్యం
హాయిగా అనిపించేది.
ఒకరోజు
రైల్వే ట్రాక్ పై చెత్త ఏరుకొంటున్న
మురికిబట్టల సీతాకోకను
చూసే వరకూ.....

5.
ఒక్కో విప్లవంలోంచి
ఒక్కో నియంత పుట్టుకొచ్చినట్లు
ఒక్కో విత్తనం లోంచి
ఒక్కో ఉరికొయ్య మొలకెత్తుతోంది.

6.
ఎంతో స్వచ్ఛంగా బోసి నవ్వులతో
ఇక్కడికి వస్తాం
మురికి మురికిగా మారి
ఏడుస్తూ నిష్క్రమిస్తాం

## ఫ్రాగ్మెంట్స్

1.
పచ్చని చెట్టుమీదకు
ఆకాశం నుండి
తెల్లని కొంగ ఒకటి
కాళ్లని ముందుకు సారించి
రెక్కల్ని లోనికి తీసుకొని
కొమ్మపై వేళ్ళను బిగిస్తూ
బివివి హైకూలా వచ్చి వాలింది

2.
ఈ అపార్ట్ మెంట్ కిటికీ
ఓ తెరుచుకొన్న గాయం.
బరువైన వక్షోజాలు
బలమైన ఊరువులతో
ప్రపంచం
ఓ ఆటకత్తై ఆకర్షిస్తోంది.

3.
ఏది తేలికైనది?
ప్రపంచం అనే భారాన్ని
మోయక్కరలేని స్వప్నమా!
హృదయం అనే సంకెళ్ళను
వదిలించుకొన్న సత్యమా!

4.
పాటు సమయాన తీరంపై
వీచే సముద్రపు వాసనలా
ఆమె దేహ పరిమళం
చలికాలపు కాన్క

5.
సామాన్లు సర్దుతుంటే
పాత ఫోను కనిపించింది
ఆన్ అయింది చిత్రంగా
కంటాక్ట్స్‌లో అమ్మ నంబరు
అలాగే ఉంది.

6.
ఏ రెండు
కన్నీటి చుక్కలు ఒకేలా ఉండవు
వాటిని చూసినపుడు
జారిన మూడో కన్నీటి చుక్క
కవిత్వం.

# బొల్లోజు బాబా

| | |
|---|---|
| తల్లిదండ్రులు | బొల్లోజు బసవలింగం, అమ్మాజి |
| సహచరి | సూర్య పద్మ |
| పిల్లలు | అపరాజిత, బసవ శ్రీధర్ |
| చదువు | M.Sc., B.Ed., M.Phil. |
| వృత్తి | జువాలజీ అధ్యాపకుడు |

రచనలు

**యానాం విమోచనోద్యమం** (2007)
**ఆకుపచ్చని తడిగీతం** (2009) కవితా సంపుటి
**ఫ్రెంచిపాలనలో యానం** (2012)
**స్వేచ్ఛావిహంగాలు** (2016) (రవీంద్రుని స్ట్రే బర్డ్స్ అనువాదం)
**వెలుతురు తెర** (2016) కవితా సంపుటి
**కవిత్వ భాష** (2018) సాహిత్య వ్యాసాలు

ఇ.బుక్స్

**'ఎడారి అత్తరులు'** (ప్రముఖ సూఫీ కవుల గీతాల అనువాదాలు)
**ఇరవై ప్రేమకవితలు ఒక విషాదగీతం** (Twenty Love Poems and a Song of Despair, Pablo Neruda , అనువాదం)
**రవీంద్రుని క్రిసెంట్ మూన్ అనువాదం**
**గాథాసప్తశతి–కొన్ని అనువాదాలు**
**వివిధ పుస్తకాల పరిచయ వ్యాసాలు**
(పై పుస్తకాలు http://www.kinige.com/author/Bolloju+Baba వద్ద లభ్యం)

| | |
|---|---|
| బ్లాగు | http://sahitheeyanam.blogspot.com/ |
| ఎఫ్.బి. | https://www.facebook.com/bolloju.baba |

అవార్డులు

*'ఆకుపచ్చని తడిగీతం'* కు శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం 2010
శ్రీ ర్యాలి ప్రసాద్ – డా. సోమసుందర్ స్మారక సాహితీ పురస్కారం 2016
ఇస్మాయిల్ సాహితీ పురస్కారం 2017
రొట్టమాకు రేవు కవిత్వ అవార్డు 2018

bolloju baba poetry

*moodo kanneeti chukka*



"Narrative poetry మనకేమీ కొత్త కాదు. అయితే, అత్యాధునిక సందర్భంలో ఈ విధమైన నిర్మాణం వెంట ముఖ్యంగా రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి: సంప్రదాయ కవిత్వ శైలిని నిరాకరించడం, రెండు- కవిత్వంలో ఒదగని సాంస్కృతిక లక్షణాలను స్వీకరించడం. ఈ రెండు పనులూ చక్కగా చక్కదిద్దుతున్నాడు బాబా.

ముఖ్యంగా- ఈ కొత్త కవిత్వ సంపుటిలో బాబా Narrative poetry కి సంబంధించిన అనేక కోణాలని మనకి పరిచయం చేస్తున్నాడు. బహుశా, ఈ సంపుటి ప్రధానంగా తలపెట్టిన task అదే! పైన చెప్పిన కవితలో ఇతర అంశాలు అనేకం వున్నా, అందులోని narration మనల్ని కట్టిపడేస్తుంది."

**- అఫ్సర్**



"పర్సనల్ అనుభవాల ద్వారా పబ్లిక్ వాస్తవాన్ని రూపుకట్టటం బొల్లోజు బాబా కవిత్వ విధానం. బయటపెట్టటాన్ని మించి దాచి పెట్టటంలోనే ఇతని కవితా కళ విశిష్టత ఉంది. He hides more than he reveals. అనార్భాట మైన వచనంతో ఆకర్షణీయమైన కవిత్వ గూడు అల్లడంలో ఈ కవి నిష్ణాతుడు. మానవ వ్యవహారాల్ని మ్యాజికల్ రియలిజం ద్వారా ప్రవేశపెట్టి మెప్పించగలగడంలో దిట్ట."

**- జి. లక్ష్మీనరసయ్య**